# ఎన్. జి. ఓ.

(కథల సంపుటి)

రచయిత్రి:
శ్రీమతి. ఎ. తేజోవతి, B. A.,




వాహినీ ప్రచురణాలయం
విజయవాడ_2.

TPLA131B128 ~~TPLA101BJ08~~

16303

3

# మనవి

నా సాహిత్యాభిలాషను ప్రోత్సహించి, పెంపొందించుకోడానికి తగు అవకాశము కల్పించిన మా శ్రీవారికి, తగిన సహాయము, ఆశీస్సులు అందజేసిన పూజ్యులు గురువర్యులు, పితృసములూనగు శ్రీ అయ్యగారి నరసింహమూర్తి, యం. ఎ. గారికి, ఈ కథానికలను తమ తమ పత్రికలలో ప్రచురించిన 'ఆంధ్రపత్రిక', 'జాగృతి' సంపాదక మహాశయులకు, పుస్తకరూపమున ప్రచురించిన "వాహినీ పబ్లిషింగ్ హౌస్" వారికి కృతజ్ఞతలు.

ఇవి నా తొలి రచనలు కనుక కొన్ని తప్పులుండవచ్చును. సహృదయులగు పాఠకులు మన్నించగలరనే ఆశిస్తున్నాను.

ఇట్లు,
రచయిత్రి.

4

# అంకితం



పూజ్యులు, గురువర్యులు, పితృసములు అయిన
శ్రీ అయ్యగారి నరసింహమూర్తి మేష్టారికి కృతజ్ఞతతో.

—రచయిత్రి.

# పిచ్చిపిల్ల

మధ్యాహ్నం ఒంటిగంట కావస్తున్నది. అప్పుడే భోజనంచేసి వచ్చిన నేను మనుచరిత్ర చదువుతూ కూర్చున్నాను. "ఫుల్లల దలకా జలకణ పల్లవిత కదంబ ముకుళ పరిమళలహరీ హల్లోహల మదబంభర మల్లధ్వాను లెసగ విసిరె మరు దంకురముల్." ఆ కమ్మని పిల్ల వాయువులు ప్రవరుని వరకే కాదు ఆ కావ్యరసాస్వాదనలో మైమరచిన నాదాకా కూడ వస్తున్నట్లుగా వున్నయి! ఎంత చక్కని వర్ణన! బాహ్యప్రపంచమును మరపించు తన కావ్యజగత్తులో పాఠకుని లీనం చేసుకోగలవాడే నిజమయినకవి......యీ విధంగా నాలో నేను తర్కించు కుంటున్నాను. ఇంతలో వెనుకనుండి యెవరో నా భుజం పట్టి వూపినట్లయింది...

"ఎవరూ!—" వెనుదిరిగిచూస్తే అక్కయ్య...

"అరగంటనుండి పిలుస్తున్నాను. భుజంపట్టి వూపే దాకా పలుకవైతివి. అయినా—ఎప్పుడూ ఆ పరధ్యాస, మతిలేని దానిలాగా యేదో ఆలోచన ఏమిటే యిది? మతి చెడ లేదుగదా!...యింతకీ యివాళ పోస్టుమాన్ వచ్చాడా?" అక్కయ్య ప్రశ్నించింది.

"ఆఁ వచ్చాడు" అప్రయత్నంగా అనేశాను.

అయినా అదేం మనిషో. పట్టుమని పది నిముషాలు వారపత్రిక గూడ పట్టిన పాపాన పోలేదు మా అక్కయ్య.

ఎప్పుడూ యింటియావ లేకపోతే వుత్తరాల గొడవ... అంతే.

"మనకేమైనా వుత్తరాలొచ్చాయ్యా?..." మళ్ళీ ప్రశ్న.

"అబ్బబ్బ!... రాలేదే..." విసుగ్గా జవాబిచ్చాను.

"ఎందుకే వుత్తపుణ్యానికి కోపంవస్తుందీ?......" అంటూ వెళ్ళిపోతోందిపాపం అక్కయ్య...

"హమ్మయ్య తొందరగానే వొదిలెంది అనుకుంటు న్నాను. ఇంతలో "పోస్టు" అంటూ కేక, ఆ వెంటనే ఒక కవరు గుమ్మంలో పడటం, వెళ్ళిపోతున్న మా అక్కయ్య వెనుదిరిగి రావడం అన్నీ ఒక్కక్షణంలో జరిగాయి.

"అదేమిటే—పోస్టుమాన్ వచ్చివెళ్ళాడన్నావుగా!..." ఉత్తరం చించుతూ ఆశ్చర్యంగా అడిగింది అక్కయ్య.

అంతలో "ఎక్కడనుంచమ్మా వుత్తరం? అంటూ అమ్మా వచ్చింది వంటింటినుండి.

"మీ అల్లుడుగారు రాశారమ్మా. వారంరోజుల్లో వస్తున్నారట. ఐనా, అమ్మా! మన కమల యిలా తయా రైందేమిటే?" అంటూ జరిగిందంతా యేకరువుపెట్టింది అక్కయ్య.

దాంతో మా అమ్మ "దీని పరధ్యాస మండిపోనూ... మనుషు లొచ్చిందీ లేందీకూడ తెలియటం లేదన్నమాట!..." అంటూ అమ్మ పెట్టేవి నాలుగూ పెట్టింది.

"హరి భగవంతుడా! ఏదో అనేసిందిలెమ్మని అక్కయ్యా వూరుకున్నా. బాగుండిపోయ్యేది. అసలు ఆ పోస్టుమాన్ యే

మలేరియానో వచ్చి సెలవుపెట్టేసినా చిక్కు లేకుండా పొయ్యేది. ఇంతకీ నా ఖర్మ!" నాలో నేను గొణుక్కున్నాను.

అసలు మా కిది పరిపాటే. నేను కవిత్వమంటే చెవి కోసుకుంటాను. కథలు రాయాలనీ, కవిత్వం చెప్పాలని మహా సందా...జీవితంలో ఏనాటికైనా 'కవికోకిల బిరుదు పొందా లని కలలు కంటూంటాను. దానికి మొదటి సాధనంగా తెలుగు సాహిత్యమంతా ఆకళింపు చేసుకోవాలని తలపెట్టాను. కానీ ఏం లాభం? పుస్తకం పట్టుకుంటేచాలు యమకింకరుల్లా వస్తారు, అక్కయ్యా, అమ్మా.

"ఈ పుస్తకాలతో ఒక్క పనిగూడ ముట్టుకోదమ్మా... మాయదారి పుస్తకాలు తగలెయ్యా—ఎప్పుడో యిది లేకుండా చూసి (ఉంటే ప్రచారం పడ్తానని తెలుసుగాబట్టి) నిప్పుపుల్ల అంటిస్తాను" అంటూ బెదరిస్తూంటుంది మాఅమ్మ.

"దానికేం మహారాణి! పుస్తకాలు ముందేసుకు కూర్చుంటే చాలు. ఏపనీ అక్కర్లేదు..." అంటూ మూతి విరుస్తుంది అక్కయ్య.

ఎప్పుడైనా పొరపాటున ఓ చక్కని ప్రబంధమో, కావ్యమో చదువుతూ మంచి రసవత్తరమైన ఘట్టంలో వున్న ప్పుడో లేక అందలి కవితామృత రసాస్వాదనతో హృదయ ముప్పొంగి అమందానందడోలికలలో వుయ్యేల లూగుతున్న ప్పుడో, అంబరాన్ని చుంబించే ఆశలు చిగురించి వేలాదిగా

భావపరంపర లుదయించి కవితాస్రవంతి బయల్వెడలబోతున్న ప్పుడో మా అమ్మ కఠోర భీషణ వాగ్బాణాలు, అక్కయ్య కర్కశహస్తాలు నన్ను కదిలించి రసజగత్తునుండి నీరసజగత్తుకు మళ్ళించడం మామూలే... అనుభవైకవేద్యమేగాని యిట్టిదని జెప్ప నలవికాని యీ దివ్య రసానుభూతి 'చెవిటికి శంఖూది నట్లు' రసగంధమేలేని వీరికెలా తెలుస్తుందిలెమ్మని సరిపెట్టుకు పోతుండేదాన్ని...

అలనాడు ఆంధ్రకవితాపితామహుండు అల్లసాని పెద్దన కవిత్వం వ్రాయడానికి కావలసిన దేశ కాల పరిస్థితు లన్నీ వర్ణించాడు.

"నిరుపహతిస్థలంబు రమణీయ ప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పు
తప్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినగాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే!"

అంటూ మహాబాగా చెప్పాడు. కాని నన్నడిగితే మాత్రం ఒక్క కవికేకాదు, పాఠకుడికికూడ యీ పరిస్థితులన్నీ వుంటేనేగాని కావ్యాలలోని రసానుభూతిని పొందలేడంటాను. అంతేకాదు 'రసజ్ఞ లూహ తెలియంగల' సోదర బంధువర్గము తప్పకుండా వుండాలి. ఐతే యెన్ని ఆటంకాలు వచ్చినా నా ప్రయత్నాన్నిమాత్రం విరమించేదాన్ని కాదు—

"ధీరుల్ విఘ్న నిహన్యమానులగుచున్ ధృత్యున్న తోత్సాహులై ప్రారబ్ధార్థము లుజ్జగింపరు గదా!" అన్న

సుభాషితాన్ని తల్చుకుంటూ వుత్సాహం కూడగట్టుకుం టుండేదాన్ని...

* * * *

వారం రోజులు గడిచాయి. ఆ నాడు మా బావ వస్తాడని అంతా హడావుడిగా వున్నారు. మధ్యాహ్నం ఒంటిగంటకు కాస్త అలా రేడియో పెట్టాను. కుంతీకుమారి రికార్డు వస్తున్నది. పక్కింటికెళ్ళి బూందగరిటెలు తెమ్మన్న అమ్మమాటలు మర్చిపోయి హాయిగా కూర్చుని రేడియో వింటున్నాను. ఎంత చక్కనిపాట! ఆ పాటలోని కవితా మాధుర్యం నన్నానంద సాగరంలో ముంచెత్తుతోంది.

అసలు ఈ పాట యింత శ్రావ్యంగా వుండటానికి కారణం 'కరుణశ్రీ' కవితా మాధుర్యమా? లేక ఘంటసాల గాన మాధుర్యమా? కాదు కాదు. కరుణశ్రీ కవిత బంగా రపు ముద్ద అనుకుంటే ఘంటసాల కంఠస్వరం దానికి వన్నె పెట్టింది. అయినా—

"బూందిగరిటెలు తెమ్మంటే యిక్కడ కూర్చున్నా వేమిటే? మాటచెబితే బొత్తిగాలక్ష్యం లేదేమిటే?..." అంటూ అమ్మవచ్చింది కేకలేస్తూ... దాంతో వులిక్కిపడి అసలుసంగతి గుర్తురాగా పక్కింటికి బయల్దేరాను కిక్కురు మనకుండా... అక్కడా అదేపాట శ్రోతలను మంత్రముగ్ధులను చేసే మధురగానానికి మైమరచి ప్రక్కనేవున్న కుర్చీమీద కూర్చున్నాను.

ఇంతలో ఆ యింటావిడ వచ్చి "ఏమ్మా! కమలా యిలా వచ్చావ్!" అంటూ పల్కరించింది. 'కుంతీకుమారి' లోని పదముల లాలిత్యాన్ని నెమరు వేసుకుంటున్న నేను వచ్చినపని మరచి తికమక పడ్తూండ ఎదురుగా రేడియో మీద పేపరు కనిపించింది "పేపరు......కోసమండీ..." అన్నాను తడుముకుంటూ.

"మీరుకూడా రోజూపేపరు తెప్పిస్తారుగా..." అన్న ఆవిడకు ఏంచెప్పాలో తోచక, "యివ్వాళ ఎందుకో మా పేపరు రాలేదండీ" అనేసి పేపరు తీసుకు చక్కావచ్చాను. అదిచూసిన అమ్మ శతమానంపెట్టి, "ఇది ఎందుకూ పనికి రానిదయిందిరా బాబూ!" అంటూ "సుధా! నీవేనా వెళ్ళి బూంది గరిటెలు యిప్పించుకు రారానాన్నా పక్కింట్లో.." అంటూ తమ్ముడ్ని పంపింది. "బ్రతుకుజీవుడా" అను కుంటున్న నాకు "చిట్టితండ్రిని బజ్జుండ బెట్టి ఆతపత్రమ్ముగా కంజాత పత్రమ్ము" ఎండతగులకుండా పడ్తున్న పాపయ్యగారి 'కుంతీకుమారి' మనోవీధిలో మళ్ళీ సంచరించింది.

ఇంతలో మా అక్కయ్య ఒసేవ్! చంటోడు ఎక్కడు న్నాడో చూడు. కుర్చీలు బల్లలు మీద తోసేసుకుంటాడు. కాస్తకనిపెట్టుండు. అంటూ హెచ్చరించింది వంటింట్లోంచి.

నేనామాటలు విన్నాను కాని అదిపూర్తిగా మన సులో నాటక, పట్టించుకోలేదు. అప్పుడే నడక నేరుస్తున్న ఆ గడుగ్గాయి ఎప్పుడు వెళ్ళాడో యేమో కుర్చీని కాస్తా

మీదకు తోసేసుకుని గుక్కపెట్టి యేడ్వటం, అక్కయ్యా, అమ్మ పరుగెత్తుకు రావడం కన్నుమూసి కన్ను తెరిచేలోగా జరిగాయి.

"ఎదురుగావుండేనా?..." ఏడుస్తున్న బాబు నెత్తుకుంటూ కోపంగా అంది అక్కయ్య.

"అదివుండీ లేనట్టేనమ్మా..." అంటూ అమ్మలోదు వచ్చింది.

'రోజూ చచ్చేవాళ్ళకు ఏడ్చేవాళ్ళెవరని' యెప్పుడూ వుండే గొడవకు దిగులెందుకు లెమ్మని సరిపెట్టుకున్నాను.

* * *

ఆ రాత్రి మా బావ వచ్చాడు. అందరం భోజనాలకు కూర్చున్నాం. వెండికంచాల్లో అన్నమూ, కూరలూ వడ్డించాక.

"ఇదేమిటమ్మా?..."

"చింతచిగురు, బచ్చలికూర కలేసి పప్పు" అంటూ అమ్మ జవాబిచ్చింది.

ఎప్పుడూ సాహిత్యాన్ని నెమరువేస్తుండే నాకు "పల నాటిసీమ పల్లెటూళ్ళో"..."తింత్రిణీపల్లవయుక్తమో వుడుకు బచ్చలి శాకము జొన్నకూడుతో..." మేళవించి అరగిస్తూ, "అల పూతన చన్నుల చేదు త్రావిన..." శ్రీహరినే సవాలుకు పిల్చిన శ్రీనాధ కవిసార్వభౌముడు భావాంబరవీధిన

తళుక్కున మెరవగా ఫక్కున నవ్వేశాను. పక్కనేవున్న మా వాళ్ళంతా విస్తుపోయారు...

"అదేమిటే పప్పునుచూసి నవ్వుతావ్!..." ఆశ్చర్యంగా అడిగాడు బావ.

"నా ఖర్మ నాయనా!...ఏం చెప్పను? పిచ్చిపిల్లకు మళ్లీ తయారైంది" అంటూ పాతపురాణం మొదలెట్టింది అమ్మ.

"ఎప్పుడూ వున్నగొడవేగా... కానీలెమ్మ"నుకున్నాను.

* * *

పదిరోజులు గడిచాయ్. ఆనాడు రాత్రి నాకు ఎంతకూ నిద్రపట్టలేదు. చైత్ర పున్నమి వెన్నెల పిండారబోసినట్లుగా వుంది. పోనీ అలా వెళ్ళి ఆ వెన్నెల్లో కొంచెంసేపు కూర్చుందామని తలుపులు తీసి ఆరుబయట వెన్నెల్లో కూర్చున్నాను. ఎంత చక్కని దృశ్యం! నిర్మల నీలాకాశంలో పరిపూర్ణ కళాశోభితుడైన శరశ్చంద్రుడు! నిద్రించే నీలమేఘశ్యాముని వక్షస్థలముపై దివ్యదీప్తుల ప్రకాశించే కౌస్తుభ మణిలా స్వర్గలోకపు ధవళకాంతులు భూతలందాకా ప్రసరిస్తున్నట్లుగావున్న నిర్మల నీలాకాశంలోని నిండుజాబిలిని ఏమని వర్ణించగలను? ఎంతని వర్ణించగలను? ఆ రాకాసుధాకరుని స్నిగ్ధకౌముది తరులపై, గిరులపై, లతలపై సర్వత్రా వెలుగులు చల్లుతోంది. ప్రకృతికాంత ఒడిలో నిదురించే అభిరామ సుందరిలా యెంత రమణీయంగా, ఎంత ప్రశాంతంగా వుందా వెన్నెల!

ఎంత చూచినా తనివితీరని ఆ ప్రకృతి సౌందర్యాన్ని యింకా యింకా తిలకించాలని, యింకా యింకా వర్ణించాలని కుతూహలపడుతున్నాను. ఇంతలో నా పాలిటి భయంకర సింహగర్జనలా మా అమ్మ పిలుపు వినిపించింది. "ఈ ప్రశాంత నిశాసమయంలో కూడ మా అమ్మకు మెలుకువరావాలా భగవంతుడా ?... అనుకున్నాను.

"ఓసి నీ యిల్లుబంగారంగానూ !... అర్ధరాత్రి తలుపులు తీసిపెట్టి యిక్కడేం చేస్తున్నావే !... ..." అంటూ అమ్మ గట్టిగా కోప్పడింది.

అమ్మ పెద్దపెద్ద కేకలువిని నిద్రపోతున్న వాళ్ళంతా వచ్చారు యిరుగుపొరుగులతో సహా ఏమిటేమిటంటూ. అమ్మ జరిగిందంతా ఏకరువు పెట్టింది. దాంతో మా అక్కయ్య "అమ్మా ! దీనికి కొంచెం పిచ్చి ఏమైనా పట్టిందేమోనని నా కనుమానంగా వుందే... లేకుంటే అర్ధరాత్రి భయం లేకుండా యిలా వొంటరిగా ఆరుబయట కూర్చోగలదటే ?" అంటూ తన అమూల్యాభిప్రాయాన్ని వెలువరించింది. వచ్చిన వాళ్ళంతా కూడ "ఏం పిచ్చో ఏమిటో" అనుకుంటూ ఎవరిదోవన వాళ్ళు వెళ్ళిపోయారు.

లోపలకు వచ్చి తలుపులు వేసుకున్నాక మా బావ "అత్తగారూ ! యిది ఒకరకం పిచ్చిలెండి. నాకు తెలుసు. దీనికి పెళ్ళిచేస్తేసరి యీ పిచ్చిగిచ్చి వొదిలిపోతాయి." అంటూ సలహా యిచ్చాడు.

"ఏమిటో నాయనా? దీని సంగతి నాకు బొత్తిగా అర్థం కావటంలేదు. తండ్రిలేని పిల్లలని గారాబంగా పెంచాను. చివరకు యిది యిట్టాపిచ్చిదయి కూర్చుంది... ఏం చేసేది?... ' అంటూ కళ్ళొత్తుకుంది.

"మీరింకేం దిగులు పడకండి అత్తగారూ. నేచెప్పాగా... చక్కటి సంబంధంచూసి తొందరలో పెళ్ళిచేస్తే సరి యీ పిచ్చీగిచ్చీ తక్కున కుదురుతుంది."

"కుదురు తుందంటావా బాబూ! దానిక్కూడా నువ్వే పూనుకోవాలి నాయనా... మాకు వేరే మగదిక్కెవరున్నారు? వాడుచూస్తే కుర్ర కుంకాయెను ...ఇక అల్లుడివైనా కొడుకువైనా నాకు నీవే నాయనా... బాబ్బాబూ... ఏదోసంబంధం చూసి ఆ మూడు ముళ్ళు పడేయించావంటే నీకు పుణ్యముంటుంది. చచ్చి నీ కడుపున పుడ్తాను..." అంటూ 'నీవే తప్ప నితఃపరం బెరుగ' నన్న ధోరణిలో అమ్మ ప్రార్థన. ఆమె పాలిటి ఆపద్బాంధవుడుగా మా బావగారి అభయప్రదానం అన్నీ చూస్తున్న నేను పొర్లివచ్చే నవ్వు నాపుకోలేక నిండా ముసుగుతన్ని పడుకున్నాను.

*      *      *      *

నెలరోజులు గడిచాయి. ఆనాడు యెందుకో ప్రొద్దున్నే మెలుకువ వచ్చింది. మేడదిగి క్రిందకు వస్తున్నాను.

తూర్పుదిశ కుంకుమపూత పూసినట్లుగా యెర్రగా వుంది. ఏమిటా అది అని చూశాను. (నాకు సహజంగా తెల్ల

వారుఝామున లేచే అలవాటు లేదులెండి!) అప్పుడే తెల్లవారుతున్నట్లుంది. ఆ అపూర్వదృశ్యాన్ని చూస్తూ అలాగే నిలబడ్డాను. ప్రకృతిని ఆవరించిన ఓ దివ్యప్రశాంతత క్రమంగా నవచైతన్యాన్ని పొందుతోంది. పుడమి తల్లిగర్భంలోనుండి వెలువడ్డ బాలభానుడు అరుణకిరణాల రాగరంజిమతో ప్రకృతికి సరికొత్త వెలుగును ప్రసాదిస్తున్నాడు. ఆకాశపు టంచులలో అటూ యిటూ కదులుతున్న మేఘమాలికలు చెదిరిన ముంగురుల్లా వ్యాపిస్తున్నాయి. వాని మధ్యన వుదయించిన సూర్యబింబం నెన్నుదుటదిద్దిన కుంకుమరేఖలా ప్రకాశిస్తోంది. ప్రకృతినంతా కలయజూచాను. ప్రకృతిలోని ప్రతి జీవపదార్థములో నవచైతన్యం తొణికిసలాడుతోంది.

అటుచూస్తే మా ఆవరణలోని పచ్చికగడ్డిపై మంచు బిందువులా అరుణోదయంలో మంచు ముత్యాల్లా యెలా మెరుస్తున్నయో! పచ్చలబాటపై పరిచిన రత్నకంబళిలా మెరిసే ఆ హిమబిందుసందోహంనుండి చూపు మరల్చుకోగలమా!...అల్లంతదూరాన ఆ పారిజాత తరువు విరిసిన పారిజాత ప్రసూనాలను విదుల్చుతూ కమలబాంధవునకు పుష్పాంజలి ఘటిస్తోంది. దినకరుని లేతకిరణాలతో నవోత్సాహిమైన ప్రకృతికాంత విడిచిన ఆనంద భాష్పాలుగాక వాటికి మారేమంటాము?...

ఎన్ని సూర్యోదయవేళలలో యీ మేడమీదినుంచి క్రిందకి వెళ్ళలేదు! కాని, వుదయించే వెలుగులరేడును

చూసీ చూడకుండా వెళ్ళిపోతుండేదాన్ని ... కానీ నిలిచి నిదానించిచూస్తే యెంతటి సౌందర్యం నిండి నిబిడీకృతమైవుందీ ప్రకృతిలో అనుకొని ఆశ్చర్యపోతున్నాను...ఎప్పుడువచ్చిందో యేమో మా అక్కయ్య, నా భుజం తడ్తూ "ఏమిటేకమలా! ఈ పిట్టగోడదగ్గర నిలబడ్డావు?..." అన్నది.

అక్కయ్యా! అటుచూడవే! సూర్యోదయం ఎంత అందంగా వుందో!......అయినా ఏదో నా పిచ్చిలే అలా చూస్తూ నిలబడ్డాను.

"ఆఁ...ఆఁ...అ పిచ్చిగిచ్చి యివాళ్టితో వొదులుతుందిలే పదపద.'

"ఏమిటే అక్కయ్యా! యిల్లంతా హడావుడిగా వుంది?" దిగివస్తూ అడిగాను.

"పెళ్ళి చూపులకొస్తున్నారే...యివ్వాళ..." అమితోత్సాహంతో వున్న అక్కయ్య అసలుసంగతి బయట పెట్టింది.

"పెళ్ళిచూపులకా?...ఎవరే అక్కయ్యా వాళ్ళు?..." అంటూ గోముగా పల్కరించేసరికి మరికొన్ని వివరాలు లభించయి.

"ఎవరేమిటే...స్వయంగా మా పినమామగారబ్బాయవుతేనూ..." అంటూ అతని భోగట్టాఅంత వివరంగా చెప్పేసింది..

"అయినా యిప్పుడు పెళ్ళెవరిక్కావాలే..." సాధ్యమైనంత మెల్లిగా అన్నాను. "ఇక్కడ నీయిష్టాయిష్టాలు యెవరూ అడగలేదులే. పదపద" అంటూ గబగబా వెళ్ళిపోయింది అక్కయ్య.

ఆ పూట మా యింట్లో హడావిడిని వర్ణించడానికి మాటలు చాలవంటే నమ్మండి. పిండివంటలు చెయ్యటం పూర్తికాలేదనే అమ్మ ఆదుర్దా. యిల్లుసరిగా సర్దటంలేదని పనివాళ్ళను హైరానపర్చి తను హైరానపడ్తున్న అక్కయ్య. మధ్యమధ్య చూ సలహాల పెదబావగారి సూపర్‌విజన్ (మా అమ్మకు కొడుకైనా, అల్లుడైనా ఆయనేగాబట్టి) పెళ్ళివారు వచ్చినప్పుడు యేబట్టలు కట్టుకోవాలో యెంచుకోలేక తికమక పడ్తున్న తమ్ముడు, చెల్లాయి. వాళ్ళను చూసి ఒక నవ్వునవ్వేసి వూరుకున్నాను. నా విషయంమాత్రం ఎవరూ పట్టించుకోలేదు.

సాయంత్రం నాలుగయింది. సరిగ్గా మధ్యాహ్నం ఒంటిగంటకు నన్నలంకరించడం మొదలుపెట్టిన మా అక్కయ్య బయట జట్కాబండి చప్పుడు వినేదాకా ఆ చీర బాగుండదని యిది, యిదికాదని అది మారుస్తూనే వుంది. అతిథి సత్కారాలన్నీ యథావిధిగా పూర్తయినాయి.

"మళ్ళీ అయిదుగంటల బండికి వెళ్ళిపోవాలండీ అమ్మాయినిలా తీసుకురండి." అచ్చంగా గార్దభ స్వరం లాంటి ఓ గొంతుక వినిపించింది.

ప్రక్కగదిలో మూలకూర్చునివున్న నన్ను అక్కయ్య చెయ్యిపట్టుకు తీసుకువెళ్ళి హాల్లో చాపమీద కూర్చో పెట్టింది.

"అమ్మాయి పేరేమిటన్నారు?..." మళ్ళీ అదే గొంతు ప్రశ్నించింది.

"ఎవరిదిబాబూ యీ కోకిలకంఠం" అనుకుంటూ కొద్దిగా తల పైకెత్తిచూశాను. ఎదురుగా యాభై యేళ్ళకు పైబడ్డ ముసలాయన కన్పించాడు. స్థూలకాయుడు. పెద్ద వినాయకుడిబొజ్జంత బొజ్జ. ఎందుకో నాకు పెళ్ళికొడుకును చూడాలనిపించలేదుగాని ఆయననే యింకా పరికించిచూశాను. ఆయనకు బట్టతలకూడా! నున్నటి నిగనిగలాడే రాగిచెంబు లాంటి బట్టతల! సరిగ్గా ఆయన తలకు కొంచెం పైగా మా యింటి దూలాలకు వ్రేలాడగట్టిన పెద్ద గుమ్మడికాయ. (మాది కొత్తగాకట్టిన యిల్లులెండి!) ఆ నిగనిగలాడే బట్టతల. దానిపైన పెద్దగుమ్మడికాయ చూడగానే చప్పున నాకో ఆలోచన తట్టింది. ఒకవేళ ఆ గుమ్మడికాయ క్రిందపడితే అనిపించింది. వెంటనే—

"ధర ఖర్వాటుడొకండు సూర్యకర సంతప్తప్రధానాంగుడై
త్వరతోడన బరువెత్తి చేరి నిలిచెన్ దాళద్రుమచ్ఛాయత
చ్ఛిరమున్ తత్ఫలభారవేగమున విచ్చెన్ శబ్దయోగంబుగా..."

అన్న పద్యం గుర్తుకొచ్చింది. దాంతో అనాలోచితంగా పెద్దగా నవ్వేశాను. అంతా నిర్ఘాంతపొయ్యారు. అనాలోచి

తంగా, అమర్యాదకరంగా ప్రవర్తించినందుకు నాకు నేనే చాల చింతించి తలవంచుకు కూర్చున్నాను.

అంతదాకా చాలా బుద్ధిమంతురాల్లా కూర్చుని ఒక్క-సారి పెద్దపెట్టున నవ్వినందుకు వాళ్ళేమనుకున్నారో యేమో గానీ "ఇక వస్తామండీ" అంటూ లేచారు పెళ్ళివారంతా....

"అయ్యో! అప్పుడేనా....కొంచెంసేపు కూర్చోండి చిన్నాన్నగారూ...." అంటున్న బావతో "చాల్లే శంకరం! ఈ పిచ్చిపిల్లను మా కిచ్చి అంటగట్టాలనుకున్నావా? మంచి పెద్దమనిషివేలే..." వెళుతూ వెళుతూ నాలుగూ అని మరీ వెళ్ళిపొయ్యారు.

వాళ్ళు గడపదాటడమే తరువాయిగా అమ్మ ఆరు నొక్క రాగం అందుకుంది. "అయ్యో....ఏం పాపంచుట్టు కుందిరామాకు, ఏడుకొండలవాడా!! నే నేంచేసేదిరా ఇంకా.. తండ్రిలేని పిల్లలని ప్రాణంకంటె యెక్కువగా పెంచుకుం టుంటే యిది పిచ్చిదయి కూర్చుందిరాతండ్రీ! ఆపద మొక్కుల వాడా! ఏమపరాధం చేశామురానాయనా. నీవే దిక్కని నమ్ముకున్నాను గదరా..." అంటూ ఏడవటం మొదలె ట్టింది. అక్కయ్య నాన్న ఫొటోవంకచూస్తూ పమెట చెరగుతో కళ్ళనీళ్ళు నొత్తుకుంటున్నది. అసలుసంగతి అర్థం గాని తమ్ముడు, చెల్లాయి, అమ్మ ఏడుస్తుంటే బిక్కమోహాలు లేసుకు కూర్చున్నారు దూరంగా. వాళ్ళందర్నీ చూస్తుంటే నాకే ఏడుపువస్తోంది.

ఇంతలో వాకిట్లోదాకా వెళ్ళి వాళ్ళను సాగనంపి వచ్చిన మా బావ "అత్తగారూ! మీరు దిగులుపడకండి... మందిప్పిస్తేసరి మతి చక్కగా వస్తుంది." అంటూ ధైర్యం చెప్పాడు.

"ఏమో నాయనా! నీ యిష్టం! మందులే యిప్పిస్తావో, భూతవైద్యులకు చూపిస్తావో—ఈ పిల్లకీపిచ్చిగనక నయమయితే ఆపద మొక్కులవాడికి నిలువు దోపిచ్చుకుంటాను..." అంటూ యింకా ఏడుస్తూనేవుంది అమ్మ.

"అత్తగారూ ..యింక యేడవకండి. మూడురోజుల్లో విశాఖపట్నం పిచ్చాసుపత్రిలో చేర్పిస్తాను. ముచ్చటగా మూడునెలల్లో మామూలుపిల్లయి రాకపోతే నా చెవిని ఘరుక్కున తెగ్గోయించుకుంటాను" అంటూ శపథంచేస్తున్న మా బావ మాటలు వినగానే నా గుండె ఝల్లుమన్నది. ఇక్కడ అనుభవిస్తున్న యీ యాతనచాలక యింకా పిచ్చాసుపత్రిలోని యమయాతనకూడ అనుభవించాలిగాబోలురా భగవంతుడా అనుకుని వణికిపోతున్నాను. కథలు వ్రాయడం 'కవికోకిల' బిరుదుమాట యెట్లావున్నా యీ సాహిత్యంపిచ్చి నన్ను పిచ్చిపిల్లనుగా మాత్రం చేసింది. ఇక చాలుగాబూ యీ సారస్వతసేవ. పిచ్చాసుపత్రిలో చేర్చకుండావుంటే దేముడికి వెయ్యినమస్కారాలు... 'ఇక యీ పుస్తకాలు ముట్టుకుంటే

ఒక్టే...' అనుకుంటూ లెంపలేసుకుంటున్న నన్ను చూపిస్తూ అక్కయ్య.

"ఒరేయ్ బాబూ! చిట్టీ! దానిజోలికాట్టేపోకండి. పిచ్చి తిరిగితే మిమ్మల్ని కొట్టనుగూడ కొడుతుంది. అది పిచ్చిపిల్ల!" అంటున్న మాటలు నాకు ములుకుల్లా గుచ్చుకున్నాయి.

ఆంధ్రసచిత్ర వారపత్రిక (13-4-60) నుండి పునర్ముద్రితము.

# ౩౨

# త ప్పు ట డు గు

సాయంత్రం ఐదు దాటింది. అప్పుడే ఆఫీసునుండి వస్తూ ట్రంక్ రోడ్డులోని "సుందరభవన్" ముందు ఆగాను. సైకిలు స్టాండులో పెట్టి తాళం వేస్తున్నాను.

"ఏరోయ్ రాజూ! అరె, ఈవూళ్లో వుంటున్నావా? ..." ఆశ్చర్యంతో కూడిన ఆ పరిచిత కంఠస్వరం విని తలయెత్తి చూశాను. కొంచెం పొడుగ్గా, సన్నగా వూగులాడుతూ నా వైపే వస్తూన్న వ్యక్తి కనిపించాడు. బెరుడుబారిన ముఖం. లోతుకుపోయిన ఆ కళ్ళల్లోని యెరుపుదనం, బాగా నల్ల బారిన పెదవులు, తైలసంస్కారంలేక నిర్లక్ష్యంగా వదిలేసిన పెళుసుజుట్టు, ఒక పాత లుంగి మోకాళ్ళపైకి యెత్తికట్టాడు. అక్కడక్కడ చినిగి-మాసిన జుబ్బా. ఆ కళ్ళల్లో సరళత లేదు——గంభీరతా లేదు. పొగరుతోకూడిన క్రూరత్వం మాత్రం కన్పడుతోంది. ఒక్కనిముషం అలాగే ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాను, ఈ కొత్తవూళ్ళో యీ పరిచితవ్యక్తి యెవరా అని. చేతిలోని 'చార్మినార్' సిగరెట్టు అవతల పారేసి తల కొంచెం ఆడిస్తూ "నేనురా... సోమును! అప్పుడే మర్చిపోయ్యావా..." అంటూ వెకిలిగా నవ్వుతూ దగ్గరకు వచ్చాడు.

"సోము!..." ఆశ్చర్యంగా తేరిపారచూస్తున్నాను... కార్లలో తిరుగుతూ వుంటాడనుకున్న సోము యీ స్థితిలో

ప్రత్యక్షమైతే నా కళ్ళనే నమ్మలేని పరిస్థితి కలిగింది. "నువ్వు సోమువా!..." నాలో నేనే గొణుక్కున్నాను... కాస్సేపటికి గానీ నమ్మకం కలుగలేదు. "అరె! సోమూ!... ఏమిట్రా యీ అవతారం?... టి. బి. పేషంటులా తయారయ్యావేమిటి? పైగా యీ వేషం?...." నా కంతా అయోమయంగా వుంది.

"ఏదో కాలం, ఖర్మ!...." మాట మధ్యలో తేల్చేసి "గురూ! లోపలికి పోదాం పద.." అంటూ హోటల్లోకి దారి తీశాడు. వెనకాలే నేనూ వెళ్ళాను. ఖాళీగావున్న కుర్చీలో కూర్చుంటూ "రెండు కాఫీ" ఆర్డరిచ్చాను.

"రెండు చపాతీ కుర్మా...." చొరవగా అనేశాడు.

టిఫిన్ తీసుకుంటూ "ఈ వూరు మకాం మార్చా వేరా?..." అని అడిగాడు.

"అవ్వలేదు. స్టేట్ బ్యాంకిలో వుద్యోగం చేస్తు న్నాను. ఈ వూరికి ట్రాన్స్‌ఫర్ అయింది..."

"ఓహో... ఏ పేటలో వుండటం?..."

"మొన్ననేరా ఛార్జీ పుచ్చుకొంది. ఇంక యిల్లు దొరక లేదు. పాగతోటలో మా చుట్టాలింట్లో వుంటున్నాను... ఇంతకూ—నీ ఫిల్మకంపెనీ ఏమయింది?..." అంటూ ప్రశ్నించాను. ఆ ప్రస్తావనమాట మధ్యలో తేల్చేసి "నీకు పెళ్ళయిందా? పిల్లలెంతమంది?..." యిత్యాది వివరాలు అడుగుతుంటే నికోటిన్‌తో గారపట్టిన ఆ పళ్ళవైపు, గుండీలు తెగిన చొక్కాలోనుండి తొంగిచూసే యెండిపోయిన యెము

కలు లెక్కపెట్టడానికి వీలుగావున్న ఆ గుండెపైపు చూడ టమే సరిపోయింది నాకు... వాడి విషయమై తెలుసుకునే అవకాశం లేకుండానే టిఫిన్ పూర్తిచేశాడు. బిల్లు చెల్లించేసి బయటకు వచ్చాము. రాగానే "భాయ్! నాకో సిగరెట్ యివ్వు..." అని అడిగాడు.

"బర్కిలీ తాగుతావా?..."

"ఏదో వొకటిలే యివ్వవోయ్." అన్నాడు. సిగరెట్ తీసి యివ్వబోతుండగా దూరంనుండివస్తూ శేఖర్—అంటే మా బంధువు—

"రాజూ!..." అంటూ పిల్చాడు. సోముకు సిగరెట్ యిచ్చి "ఓ!... శేఖర్!... ఇవ్వాళ ఆఫీసునుండి త్వరగానే బయటపడ్డావే..." అని వాడితో మాట్లాడుతున్నాను. ఇంతలో "వస్తానోయ్... మళ్ళీ రేపు కన్పిస్తాలే......" అంటూ సోము నా జవాబుకైకూడ ఆగకుండా తలవంచుకు గబగబా వెళ్ళిపోయ్యాడు—

"అది సరే[illegible]... ...రాజూ!—యీ జేబుదొంగ నీ కెట్లా తటస్థపడ్డా[illegible]?..." సోమును చూపిస్తూ అడిగాడు శేఖర్.

ఒక్క మాట[illegible] వులిక్కిపడ్డాను. "జేబు...దొంగా!..." నేను నిర్ఘాంతిపోయ[illegible]ను.

"అవును...[illegible]ప్పుడు నీ దగ్గర సిగరెట్ తీసుకొవెళ్ళిన వాడు పచ్చిదొంగ... ఇలా హోటళ్ళముందు తచ్చాడుతూ

వుంటాడు. కాస్త తెలిసిన ముఖం కనబడితే కాఫీ పోయించ మనీ, సిగరెట్ యిప్పించమనీ వెంటబడతాడు... వీలుచిక్కితే జేబుకొట్టేసి పారిపోతాడు. ఒకటి రెండుసార్లు జైలుకూడ వెళ్ళొచ్చాడు..." శేఖర్ చెప్పుకుపోతుంటే నాకు నమ్మశక్యం కాలేదు.

సోము చిన్ననాటి మిత్రుడు. అందులో మా గుంటూరులో ప్రఖ్యాతిగడించి కీర్తిశేషుడైన ఒకానొక లాయరు కొడుకును అంతమాట అంటుంటే నా మనసుకు చాలా కష్టం కలిగిందికూడ... "అతన్ని గురించి నీకు బాగా తెలుసా?..." నాకేం తెలియకుండానే నా స్వరం కొంచెం తీవ్రమయింది... శేఖర్ ముఖం చిన్నబుచ్చుకున్నాడు. "అతడిమీద అబద్ధం చెప్పాల్సిన అవసరం నాకేమి వచ్చిందోయ్?..." అన్నాడు.

"అహాహా. నే నడిగేది అతన్ని నువు బాగా యెరుగుదువా అని." అంటూ సర్దుకున్నాను.

"నాకు తెలియకపోవడమేమిటి? బెజవాడలో వాళ్ళన్నయ్యా వాళ్ళూ, మేమూ పక్కపక్క యిళ్ళల్లో వుండేవాళ్ళం. వాళ్ళన్నయ్య చాలా మంచివాడు. ఈ సోమును చాలా గారాబంగా పెంచారుట చిన్నప్పటినుండి. వాళ్ళ నాన్నగారు పోగానే అడ్డూ ఆపూ లేకుండాపోయి అన్నయ్యతో పోట్లాడి ఆస్థి పంచుకున్నాట్ట. తరువాత కొంత డబ్బు తీసుకొని యెవరితోనో కలసి సినిమా తీస్తానంటూ మద్రాసు వెళ్ళాడట... అక్కడ యిష్టంవచ్చినట్లంతా తిరిగి

దుర్వ్యసనాలకులోనై చివరికి ఆ సినిమా తీస్తానన్నాయన ఆ డబ్బుకాస్తా కాజేసి, కంపెనీకి నష్టం వచ్చిందంటూ యెత్తేశాట్ట..." ఆ నడిరోడ్డుమీద నిలబడి శేఖర్ అలా చెప్పుతు పోతుంటే నా ఆలోచనలు యెటోయెటో పోయినయ్....

శేఖర్ యింకా చెప్తూనేవున్నాడు.... ఆ తర్వాత మరో కంపెనీలో చేరాలని మిగతా ఆస్తికూడ అమ్మేసి మద్రాసు చేరినవాడు, జల్సాలుచేసి అంతా పాడుచేసుకున్నాట్ట! సినిమా తియ్యడంపొయ్యి కనీసం అందులో ఎక్స్ట్రా వేషాలుకూడ దొరకక యింటిముఖంపట్టే వాళ్ళన్నయ్యకు జాలేసి యెక్కడో ఓ చిన్న వుద్యోగం యిప్పించాడు వీడికి.....కానీ—వీడి బుద్ధి తిన్నగావుంటేనా?....చేతికి డబ్బు చిక్కితేచాలు, అది యెవరిదైనాకాని, కొట్టేసి మద్రాసు వెళ్ళి జల్సాచేసి వచ్చేవాడు. చేతిలో చిల్లిగవ్వ లేకపోతే మాత్రం చాలా బుద్ధిగా వుండేవాడు. ఇలా చాలాసార్లు చేశాక తన పరువుకూడ పోతుందని వుద్యోగం మాన్పించి యింట్లోనే వుంచుకున్నాడు. కాని వొక రోజు బీరువాలో వున్న వాళ్ళ వదిన నెక్లెస్ కాస్తా తీసేసి వుడాయించాడు. అప్పటినుండి వాళ్ళన్నయ్య యింట్లో అడుగు పెట్టనివ్వలేదు. తరువాత యెప్పుడుచేరాడో మేమీవూరు వొచ్చేసరికి యిక్కడ కన్పడ్డాడు—ఈ చరిత్రతో.....కానీ నన్నుచూసేసరికి చల్లగా జారుకుంటాడు. ఈ వూరికి యితను పరిచితుడే. కానీ, నువ్వు అపరిచితుడవని, కాస్త జాగ్రత్తగా వుండమని హెచ్చ

రిక చేశాను......కానీ— ఎందుకోయ్ నీ కంత కోపం వచ్చింది ?..."

శేఖర్ వేసిన ప్రశ్నకు యేమని జవాబు చెప్పను ?... చిన్ననాటి స్నేహితుడని చెప్తే బాగుంటుందా ?...ఏమీ చెప్పకుండా మానేస్తే శేఖర్ యేమనుకుంటాడో ననిపించింది..."అదో పెద్ద కథలే శేఖర్ ...ఇక్కడ యిలా నడిరోడ్డు మీద యిలా నిల్చోవడం. ఏమిటా అని జనం అనుమానంగా చూడ్డం బాగుండలేదు. అలా పెన్నవొడ్డుకు వెళ్దాంపద..." అంటూ తీసుకెళ్లాను.

నది ఒడ్డున యిసుకలో కూర్చుని నదీ తరంగాలపై పడ్తున్న సాంధ్యకిరణాలను చూస్తున్నాను. నా మనసు మనసులో లేదు..... బాల్యస్మృతులు నెమరువేస్తోంది.....అలా పెన్నవైపు చూస్తున్న నాతో "ఐతే యితడు నీ కిదివరలో తెలుసన్నమాట..." అంటూ ప్రారంభించాడు శేఖర్.

"తెలుసు శేఖర్! అందుకే యింతగా బాధపడ్తున్నాను. ఒక సంపన్నునియింట పుట్టి, అతి గారాబంగా పెరిగిన వాడు చివరకు జేబుదొంగగా మారాడంటే!... నేను నమ్మలేకపోయ్యాను ..హుఁ! మానవుడు చేసే చిన్న పొరపాటె ఒక్కోసారి యెంత హీనస్థితికి దిగజారుస్తుందో !...సోమును తల్చుకుంటే నా హృదయం తరుక్కుపోతుంది శేఖర్ !... అంతేకాదు—ఒకనాడు నేనూ యిలాగే పొరపాటుపడ్డాను... కాని. సకాలంలో సరిదిద్దుకున్నానుగాబట్టి సరిపోయింది లేక

పోతే—బహుశా నేనూ యిలాగే..... తిరుగుతుండేవాణ్ని గాబోలు..." పట్టూాప్పు విడిచాను... శేఖర్ తెల్లబోయి చూస్తున్నాడు నావైపు...

"నే నంటున్నది నిజమే శేఖర్! మేము అప్పుడు గుంటూర్‌లో వుంటుండేవాళ్ళం. ఫోర్తుఫారంలో వీడూ నేనూ క్లాస్ మెట్స్‌మే. వీడికి యింట్లో గారాబంమూలాన గాబోలు చదువు బాగా అబ్బేదికాదు....తండ్రి కోరినంత డబ్బు యిచ్చేవాడు. వీడు చాలా పోకిరిగా తిరుగుతూ, బడి యెగ్గొట్టి స్నేహితుల్ని పోగుచేసి సినిమాల కెళ్ళడం, కాఫీ-టిఫిను పెట్టించడం, సిగరెట్లు కొనివ్వడం యీ విధంగా జరుగుతుండేది. ఒకరోజు నేను వాడితో తిరుగుతుండటం చూశారు నాన్నగారు. ఇంకేముంది! నా వీపు విమానం మోత మోగిందనుకో—పైగా యింకెప్పుడైనా వాడితో తిరిగినట్లుకనబడాలి, చర్మం వొలిచేస్తాననాన్నరు అప్పటినుండి వాడితో తిరగడం మానేశాను.

కొన్నేళ్ళు గడిచాయి... ...మా రోజులు బాగులేక నాన్నగారు గతించారు. రెక్కలువిరిగిన పక్షిలా అయింది అమ్మస్థితి. ఉన్న కొంచెం ఆస్థితోనూ మమ్మల్ని యెలా చదివించిందో బహుశా నీకూ తెలుసనుకుంటాను... ఇంటర్మీడియెట్ చదువుతుండగా ఒకరోజు బజార్లో కన్పించి పలుకరించాడు. ఫోర్తుఫారమ్ వరుసగా మూడేళ్ళూ తప్పేసరికి విసుగెసి మానేశాడట. 'ఎందుకొచ్చిన చదువోయి. హాయిగా కలుమీద కాలేసుకు కూర్చునితినక. అందుకే నాన్నా యిక

నేను చదవనని చెప్పేశాను.' అన్నాడు. 'సినిమాకెళ్దాంరా' అంటూ బలవంతంచేసి తీసుకెళ్ళాడు.

అలాఅలా మా స్నేహం వృద్ధిఅయింది. క్రమంగా నాకూ వాడితో సర్దాగా తిరగడం అలవాటయిండి. అదనీ యిదనీ వంకపెట్టి అమ్మదగ్గర ఐదూ పది తీసుకెళ్తుండేవాడిని. యూనివర్శిటీ పరీక్షలు దగ్గరకొస్తున్నయి. పెందరాళే యింటికి రావటంలేదని, బాగా చదవటంలేదని అమ్మ తిడుతుండేది. కాని—ఆమె తిట్లు దున్నపోతుమీద జడివాన కురిసినట్లు వృధాఅయినయి. పరీక్షలై రిజల్ట్సుకూడవచ్చాయి. క్లాసు వస్తుందనుకున్న నాకు పరీక్షపోయింది. డాక్టరు చదివించాలనుకుంటున్న అమ్మకు యిది యెంతో కష్టం కలిగించింది. ఆనాడు యింటికిరాగానే అమ్మ యెన్ని తిట్లు తిట్టిందో చెప్పలేను.

శేఖర్ ! పాపం అమ్మ నా భవిష్యత్తును గురించి యెన్ని కలలు కన్నదో—ఆ విషయాలు తల్చుకుంటే యిప్పుడని పిస్తుంది. అది మాతృ హృదయంలోని క్షోభ అలా తిట్లరూపంలో ప్రవహించిందని... కానీ ఆ రోజుల్లో మాత్రం అది గ్రహించగల స్థితిలోలేను. అమ్మ అలా దుమ్మెత్తి పోస్తుంటే నా మనసు యెదురు తిరిగింది. మా యిల్లు, ఇంట్లో వాళ్ళు అంతా నాకు విరోధుల్లా అనిపించారు. గిరుక్కున తిరిగి సోము దగ్గరకు వెళ్ళాను. వాడికి జరిగిందంతా చెప్పుకు యేడ్చాను. అవి వాళ్ళ నాన్నగారు పోయిన కొత్తరోజులు. వాళ్ళన్నయ్యతో తగవు పెట్టుకుని ఆస్థిపంచుకు వచ్చేశాడు.

ఏ బాదర బందీ లేకుండా స్వేచ్ఛగా తిరుగుతున్నవాడు. నాకేమన్నా దోవ చూపకపోతాడా అనే ఆశతో చెప్పుకున్నాను నా కథంతా విని నాకో సలహా యిచ్చాడు. ఆనాడు ఆ సలహా నాకు లక్షవరహాల విలువైనదిగా అనిపించింది!...

మద్రాసులో వాడికి తెల్సినాయన వొకడు ఫిల్ము కంపెనీ పెట్టాలనుకుంటున్నాడని కావాలంటే యెవరికైనా సరే షేర్లు యిస్తానన్నాడని చెప్పాడు. 'ఇద్దరంచేరి ఐదువేల రూపాయల షేర్లు కొంటేసరి. మంచిలాభాలు వస్తాయి. కొద్ది రోజుల్లోనే లక్షలు లక్షలు మనముందు పడతాయి.' అంటూ సలహాయిచ్చాడు. నేను వెంటనే వొప్పుకున్నాను. 'అయితే యెలాగో ఆ డబ్బుతో సహా నువ్వు బెజవాడ వచ్చెయి. నేను యెవరికీ అనుమానం కలగకుండా ముందుగా వెళ్ళి బెజవాడలో ఫలానా.......బండికి యెదురు చూస్తుంటాను. అటున్నించి మద్రాసు వెళ్ళొచ్చు.' అంటూ ప్లాన్ వేశాడు. ఆ ప్రకారమే మర్నాడు సాయంత్రం కొంచెం కొంచెం చీకట్లు పడుతుండగా ఐదువేల రూపాయలతో సహా బెజవాడ బండెక్కాను.

శేఖర్! డబ్బు కాజేసి యింట్లో చెప్పకుండా అలా పారిపోతుంటే నా మనసెట్లా బాధపడుతూ వుండివుంటుందో నువ్వే వూహించుకో... ...అందులోనూ యిదివరకెప్పుడూ యిల్లాంటి పనులెరుగను. రైల్లో కూర్చున్నా నన్నమాటే గాని మనసు స్థిమితంలేదు. అయినా—సోముచెప్పిన సలహా. మద్రాసులోని స్వేచ్ఛాజీవితం. మేము స్థాపించబోయే ఫిల్ము

కంపెనీ లాభాల తాలూకూ నోట్లకట్టలు నన్ను బలవంతంగా పెట్టెలో కట్టిపడేసినట్లుగా వుండేది. నా దిగులు మర్చిపోవా లని రైలు కిటికీలోంచి బయటికి చూస్తున్నాను. నా లోని ఆలోచనల్లానే ఆకాశంలో అక్కడక్కడ మబ్బులు ముసురు కుంటున్నాయి. నా హృదయంలో రేగే పెనుతుఫానులాగే బయటగూడ గాలిదుమారం రేగుతోంది. ఆ గాలికి నిప్పు రవ్వ వొకటి వచ్చి నా కంట్లో పడ్డది. 'అమ్మా' అని కళ్ళు మూసుకున్నాను. అమ్మ కళ్ళల్లో మెదిలి నట్లయింది. మా అమ్మ యెప్పుడూ అంటూ వుండేది కిటికీలోంచి తొంగి చూడవద్దని...అమ్మ జ్ఞాపకం రాగానే ఆవిడయేంచేస్తు న్నదో...అనిపించింది.

మళ్ళీ మళ్ళీ నా ఆలోచనలు పరిపరి విధాల పోతు న్నయి. మొన్న అమ్మ యెందుకంత 'యిది' గా——ప్రవర్తించింది!...ఒక్కసారి పరీక్షపోతే అన్ని తిట్లు తిట్టలా? నా చదువుకు పెట్టిన డబ్బంతా గంగపాలయిందట. యేదో చదివి వుద్ధరిస్తాననుకుంటే యెందుకూ పనికిరాని వాడి నయ్యానట!....ఒక్కరోజైనా వేళకు యింటికి రాలేదట, చదవలేదట!....వూరికే యెలా నెగ్గుతారు పరీక్షల్లో——అంటూ యెన్ని మాటలంది!——నా ఒంట్లో చీమూనెత్తురూ లేదా అన్నిమాటలు పడివుండడానికి?——పోకిరీతిరుగుళ్ళట! 'వినాశకాలే విపరీతబుద్ధిః' అని చెడేకాలం వచ్చింది. కాబట్టి యిలా చెడుబుద్ధులు పుడుతున్నయ్యట!——నా స్నేహితులు నాకు తెలియవుగాబోలు....పైగా 'ఆయన నలుగురిలోనూ

యోగ్యుడని యెంత పేరు తెచ్చుకున్నారో. నువ్వంత దౌర్భాగ్యుడ వయ్యావు...ఛీ! సిగ్గేనా లేదు! కడుపున చెడ బుట్టావ్.' అంటూ కుక్కని చీదరించినట్లు చీదరించుకుంటే పడివుండడానికి నేనేమన్నా పశువునా?... లేక చిన్నపిల్లాడినా పదిహేడేళ్ళవాడిని... అలా యిష్టం వచ్చినట్లు మాటలంటే మానాభిమానాలు లేకుండా పడుంటాననుకోంది... ఇప్పుడు తెలిసొస్తుంది. నేను ప్రయోజకుడ్నో—అప్రయోజకుడ్నో...

ఇలా అనుకుంటూవుండగా బండి నంబూరు స్టేషను దాటింది. అప్పుడే కొద్దిగా జల్లు ప్రారంభమయింది... కిటికీ లోంచి తుప్పగ నామీద పడుతోంది. ఆ చిన్నజల్లులో కూర్చోడమంటే నాకు చాలా సరదా......కాని అమ్మ వానలో తడవకూడదంటూ చెప్పేది. ఒకసారి యిలాగే అమ్మమాట వినకుండా వానలో తడిసివచ్చాను. వెంటనే జ్వరం—దానిమీద న్యూమోనియా—అప్పుడు అమ్మ. చెల్లెలు వాళ్ళు యెంత హడలిపొయ్యారు? నిద్రాహారాలు మాని యింటిల్లిపాది నా మంచందగ్గిరే గడిపేవాళ్ళు...నా ఆరోగ్యం గురించి అమ్మ యెంత బెంగపడ్డది! "నా ఆశలన్నీ వాడిమీదనే పెట్టుకు బ్రతుకుతున్నాను. ఈ గండంగడిచి గట్టెక్కించు తండ్రీ!" అంటూ యెన్ని దేముళ్ళకు ముడుపులు కట్టింది! అంతగా నా ఆరోగ్యంకోసం పరితపించిన అమ్మ. కళ్ళల్లో వొత్తులు వేసుకుని రాత్రింబవళ్ళు నా దగ్గిరేవున్న అమ్మకు అంతలో నామీద అసహ్యం వేసుంటుందా?... అబ్బే! అలా జరగదు... నే నేదో ప్రత్యేకంగా తలకెత్తుతానని

ఆశపెట్టుకుంటే—ఆశ నిరాశకాగానే ఆమె పాపం యెంత బాధపడిందో...ఆ కోపంమీద కన్నతల్లి యేవో రెండు మాటలంటే నే నింతగా అపార్థం చేసుకోవాలా!......ఈ విధంగా యిల్లువదలి వచ్చేయాలా...అసలు యింతదాకా యింటికి చేరుకోలేదని అమ్మ యెంతగా యెదురుచూస్తు న్నదో!...నిజానికి—భయంకరంగా గర్జించే కారుమేఘాలే భూమిని సస్యశ్యామలంచేసే చక్కటి వాననిస్తాయి తేలికైన తెల్లమబ్బులు అంటీపట్టకుండానే సాగిపోతాయి. శ్రేయస్సు కోరే ఆత్మీయులే తప్పుచేస్తే గట్టిగా మందలిస్తారు......ఈ విధంగా అనిపించేసరికి అమ్మమీద అంతులేని అభిమానం పొర్లుకొచ్చింది. అమాంతం పరుగెత్తికెళ్ళి అమ్మ కాళ్ళమీద పడాలనిపించింది...

మళ్ళీ అంతలోనే విరక్తికలిగింది...శేఖర్! ఏనాటి సంఘటనో యిలా పూసగుచ్చినట్లు చెప్పగలుగుతున్నానని ఆశ్చర్యపోతున్నావా?...కొన్నికొన్ని సంఘటనలు మర్చి పోదామన్నా మరుపురావు......ఎప్పుడు జ్ఞాపకంవచ్చినా అప్పటికప్పుడు జరిగినట్లుగా అనిపిస్తయి...అమ్మమీద అభి మానమయితే కలిగిందిగాని వెంటనే స్వార్థం దాన్ని కమ్మే సింది—

ఇంటికెళితే సుఖమా, పాడా—మళ్ళీ ఆ గానుగెద్దు జీవితమేగా...చదువు, యిల్లు, అమ్మ, చెల్లెలు, ఆకతాయి తమ్ముడు...వాళ్ళకోసం, నా జీవితం, నా ఆనందం ఎందుకు పాడుచేసుకోవాలి. .అప్రయత్నంగా నా చెయ్యి కోట్లుకట్టలతో

బరువుగావున్న పాంటుజేబుమీద పడ్డది... అవును!...ఐదు వేలు!!...నాదగ్గర ఐదువేలు!!! నెలకు ఐదురూపాయ లివ్వలేకపొయ్యేది అమ్మ...ఇప్పుడో...సగర్వంగా పాంటు జేబు తడుముకున్నాను...ఈ ఐదువేలు నన్ను బాధలనుండి విముక్తిపొందించి స్వర్గధామం చేరవేసే సోపానపంక్తి!... ఈ డబ్బుతో పేర్లుకొంటాను...వచ్చిన లాభంతో మళ్ళీ పేర్లు...అలాగే ఒక పెద్ద ఫిల్ము కంపెనీ ప్రొడ్యూసర్ అయి పోతాను...అప్పుడు నన్ను గురించి నా ఘనతగురించి ప్రజలు పత్రికలు అంతా తెగపొగిడేవాళ్ళు...టి. నగర్‌లో ఓ లక్ష రూపాయలుపెట్టి బంగళా కట్టిస్తాను...నింగిన మెరిసే తారక ల్లాంటి తారలు తళుకుబెళుకులతో, హొయలు నడకలతో నా ఆజ్ఞకోరకే కాచుకూర్చొని వుంటారు! మరికొందరు అరవిందానలు, చారుచకోరనేత్రలు నా క్రీగంటిచూపుకోసం పడిగాపులుపడివుంటారు! ఓహ్! సోము చెప్పినట్లు అది దేవేంద్రభోగం!!...కాడిలాక్ కారులో అప్పుడొచ్చినప్పుడే అమ్మను అడగాలి యెవరు పనికిమాలిన వాళ్ళో....

"శేఖర్! నా ఆలోచనలు వింటుంటే నీకు నవ్వు వస్తోంది కదూ!...కానీ ఆ వయసు అలాంటివోయ్... స్వర్గానికి నిచ్చెనలు వేయడంలోనే ఆనందం వుండేది..."

ఉన్నట్టుండి మరో అనుమానం—ఒకవేళ డబ్బు తీసుకు పారిపొయ్యానని పోలీసు రిపోర్టుయిస్తే!—అబ్బే! అమ్మ అలా యెప్పటికీ చెయ్యదు...పోనీ ఇస్తే యివ్వనీ — మళ్ళీ మొండిధైర్యం...ఆ డబ్బు నాదికాదా! నాకా

మాత్రం పాక్కలేదా? అదేమంటే ఆస్థిపంచెయ్యమంటాను. అంతే కాని నాకేం భయం?...

అప్పటికి రైలు మంగళగిరి దరిదాపులకు వస్తోంది. గాఢాంధకారాన్ని చీల్చుకుంటూ దూరంగా కనిపించే కాంతి పుంజాలవైపు తీసుకుపోతోంది. అప్పుడా రైలు నాకెలా అనిపించిందో తెలుసా శేఖర్.. నీలినీడలు ప్రతిఫలించే నీళ్ళ జాలును చీల్చుకుంటూ అందాల దీవివైపు పయనించే పూల నావలా అనిపించిందినాకు....

మంగళగిరి స్టేషనులో పదిహేనేళ్ళమ్మాయి, పన్నెండేళ్ళ కుర్రాడు యిద్దరు మా పెట్టెలోకి యెక్కారు...

జల్లుబాగా కొడుతోందని కిటికీ తలుపులు వెయ్యబోతున్నాడు కుర్రాడు. తమ్ముడూ జాగ్రత్తరా! వేలునలిగేను. అక్క హెచ్చరించింది...నాకెందుకో వాళ్ళను చూడగానే వెనుకటి సంఘటన ఒకటి మదిలో మెదిలింది. అంతకు ముందు ఐదారేళ్ళనాడు కాబోలు నేనూ, మా చెల్లెలు, మా మేనమామగారింటికి వెళ్తున్నాము. రైలు కిటికీలో నుండి చూస్తే పరుగెడ్తున్నట్లుగా వుండే పంటపొలాలు, తాటి తోపులు, నాచుమొక్కల తోడిసిటి మడుగులు. చూడటం అంటే సరదా చెల్లికి... ...'అన్నయ్యా కిటికీరెక్క తియ్యవా?' అని అడిగింది.

'కళ్ళల్లో రవ్వలు పడతాయివద్దు...' అన్నాను. కాని నాన్నగారు చెల్లి పట్టుబట్టేసరికి సరేనని రెక్క యెత్త

పోతున్నాను.... మధ్యలో చెయ్యిజారి రోక్కలి కిందపడి వేలు నలిగింది... 'అబ్బా!' అంటూ బాధతో కళ్ళు మూసుకున్నాను. నెత్తురు గూడుకట్టి నల్లగా వున్న ఆ వేలును తన చేతిలోకి తీసుకొని చెల్లి వూదుతోంది. కొద్దిగా బాధ తగ్గాక కళ్ళు తెరిచేసరికి చెల్లి కళ్ళనిండా నీళ్ళు.

"ఎందుకు నువ్వేడుస్తున్నావ్?......" నాకు నవ్వొచ్చింది...

"నానుంచే గదరా అన్నయ్యా... నీ వేలు నలిగిందీ." అంది ఆ ఒక్క మాటలోను ఆప్యాయత వుట్టిపడింది. తన మూలంగా నాకు కష్టం కలిగిందన్న బాధ, నా బాధను చూసిన జాలి. ఆ కళ్ళల్లో ప్రస్ఫుటంగా కన్పించాయి ఆ చిక్కని మొగం, ఆ కన్నీళ్ళు చూడగానే నా బాధనంతా మర్చిపోయ్యాను. 'నాకు దెబ్బ తగల్లేదులే... నువ్వేడవకు.' అంటూ రుమాలుతో దాని కన్నీళ్లు తుడిచాను.

"ఆ సంఘటన తల్చుకోగానే నా కళ్లు చెమ్మగిల్లినయి మళ్ళీ చెల్లెల్ని చూసేది.ఎప్పటికో... పాపం. 'అన్నయ్యా! అన్నయ్యా!' అంటూ చుట్టుకు తిరుగుతుండేవాడు తమ్ముడు. అమ్మమాత్రం! రాత్రి పదకొండుగనీ... పన్నెండుగానీ నాకు అన్నంపెట్టందే తను తినేదేకాదు. వాళ్ళందర్నీ వొదిలి యిలా చెప్పకుండా పారిపోవడమంటే యేడుపు వచ్చినంత పనవుతోంది....

"అయినా—చెల్లి పెళ్ళికని ఇల్లుతాకట్టు పెట్టి తెచ్చిన డబ్బు నేనెత్తుకొచ్చాను. డబ్బులేక పెళ్ళి ఆగిపోతే చెల్లి

యెంత బాధపడ్తుందో. రక్తంపంచుకు పుట్టిన చెల్లెకి యెంత అపచారం చేస్తున్నాను!...మనసు కలవర పడింది.

వెంటనే నాకు నేనే జవాబు చెప్పుకున్నాను. ఇందులో అపచార మేముంది?... రేపునేను లక్షాధికారినయినప్పుడు నా వారి నందర్నీ వొడ్డెక్కిస్తానా!... చెల్లెల్ని తీసుకువచ్చి కోరినంత కట్నమిచ్చి కోటీశ్వరుని యింటి కోడల్ని చెయ్యనా అయినా మళ్ళీ యీ పిచ్చిమమకారం... ...భవంతులలో వసించ బొయ్యేనేను నాలుగు గదుల పెంకుటింటిని మర్చిపో లేకుండా వున్నాను.

"శంకర్! నిజం చెప్పాలంటే అల్లకల్లోలంగా వున్న సముద్రంలో వూగిసలాడే నావలా వుందిప్పుడు నా మానసిక స్థితి...మమతానుబంధాలకూ, యువనావస్థలోని కమ్మని కల లకూ జరిగిన సంఘర్షణ అది...మళ్ళీ అంతలో సోము జ్ఞాపకం వచ్చాడు. వాడిది యెంత దర్జా జీవితం! పల్లెత్తు మాట అనేవాళ్ళు లేరు. అవధులు లేని ఆనందం అంతా వాడిదే...ఏం!...నేను మాత్రం యెందుకలాంటి జీవితం గడపకూడదు? సోము చెప్పినట్లు నోట్లో నాలుక, బుర్రలో ఆలోచన వుండాలేగానీ అంతకు వెయ్యింతలు సుఖపడొచ్చు.

మళ్ళీ యింతలో యింకో వూహా పోయింది. ఒకవేళ కంపెనీకి నష్టంవస్తే!...అమ్మో!...ఇంకేముందనిపించింది.. నా సంగతేలా వున్నా చెల్లి జీవితం పాడయి పోదూ...అష్ట కష్టాలు పడుతున్న అమ్మకు యిది ఒక గొడ్డలి పెట్టు కాదూ! మగబిడ్డనై యుండి అమ్మను ఆదుకోవాల్సిన వాడిని నేనే

యిలా ప్రవర్తిస్తే! అమ్మ యీ మనోవ్యాధితో మంచ మెక్కితే?... వద్దు! వద్దు అలా జరక్కూడదు!... ...అను కున్నాను.

శేఖర్! రాజు యింత అస్థిరుడేమిటా అనుకుంటు న్నావుగదూ? ఇటు స్వార్థాన్ని చంపుకోలేక అటు రక్త భాంధవ్యాన్ని తెంపుకోలేక నేనుపడ్డ మధన—ఆ పరమా త్ముడికే తెలియాలి.

ఇంత ఆలోచించినా మళ్ళీ నేను చేస్తున్నపని మంచిదే అనిపించింది. అసలు ఆ యువకరక్తపు పొంగులోవున్న తమా షానేఅది కాబోలు. తను చేసేది తప్పనిగానీ... ఒకవేళ తప్పని తోచినా అది వెంటనే సరిదిద్దుకోవాలని గానీ అనిపించదు. ఓ పట్టాన... సోముకు తప్పకుండా వస్తానని మాటయిచ్చాను. తప్పితే వాడేమనుకుంటాడు? నువ్వింత పిరికి పందవని తెలి సుంటే ముందే వద్దనే వాడినే. అంటూ దెప్పిపోడవడా? ఏద యేమయినా కానీ—వెళ్ళాలి! వెళ్ళితీరాలి! కంపెనీకి నష్టం వస్తేరానీ... యింటిల్లపాదీ గంగలో కలిస్తే కలవనీ—నే వెళ తాను... కొన్నాళ్ళయినా సుఖంగా తిరిగివస్తాను. కాకిలా కలకాలం బ్రతికేకంటే హంసలు ఆరునెలలు బ్రతికితే చాలం టారు—అసలు వాళ్ళందరి కోసం నా సుఖం యెందుకు మానుకోవాలి! మానవుడు చేసే ప్రతిపనిలోనూ యింతో అంతో స్వార్థం వుంటుందంటారు. స్వార్థంలేని మనిషే వుండడు...న్యాయంగా చూస్తే ఆ డబ్బుమీద నాకూ హక్కువుంది. నా డబ్బును నేను నాశనం చేసుకుంటే అడగ డానికి వాళ్ళకేం హక్కుంది. అసలు అన్నిమాటలు పడి యేం

ముఖం పెట్టుకుని యింటికి వెళ్ళను? ఏది యేమయినా ముందుకు పోవాలంటే, వృచ్ఛస్థితికి రావాలంటే యిలాంటి సంకెళ్లు తెంచుకోవాలి... పిరికి ఆలోచనలు చంపుకోవాలి... సాహసం చూపించాలి... అప్పుడే కలలు నిజాలయితెయి... ఇంతే— యిక ఆ యింటికి నాకూ నేటితో ఋణం తీరి పోయింది. అనే నిశ్చయానికి వచ్చి మనసు రాయి చేసుకు కూర్చున్నాను...

నా ఆలోచనలతో సతమత మవుతూ కంపార్టుమెంటులో ఓ మూల కూర్చున్న నేను బండి వున్నట్టుండి ఆగడంతో వులిక్కిపడి తొంగిచూచాను స్టేషనేమోనని....కాదు స్టేషనులా లేదు....చిక్కటి చీకట్లో జనం కోలాహలంగా దిగుతున్నారు. అయినా నాకేమో దిగబుద్ధి పుట్టలేదు. పది నిముషాలకు రైలు కదిలింది.

"పాపం! ఎవరో ఆడకూతురు పదిహేను పదహారేళ్ళుంటాయి..." పక్కనున్న పల్లెటూరి ముసలాయన యింకెవరితోనో చెబుతున్నాడు...

"ఏం జరిగిందేమిటి?" మరో ప్రయాణీకురాలు ప్రశ్నించింది.

"ఎవరో అమ్మాయి రైలుకింద పడ్డది. కొనప్రాణంతో బెజవాడకు తీసుకెళుతున్నారు...బాగా గాయాలు తగిలయి. ఏం బతుకుతుందో."

"వాళ్ళవాళ్ళెవరన్నా వచ్చారా!...."

"చీకటి, దానికితోడు వాన...ఎవరొస్తారు!......
ఆ వూరివాళ్ళేట.. రైల్లో నెవరో గుర్తుపట్టి ఫలానావాళ్ళ మ్మాయి అంటున్నారు..."

"అంత చిన్నమ్మాయికి ప్రాణాలు తీసుకోవాల్సిన అవసరం యేమొచ్చిందో?..."

"ఆ తల్లివాళ్ళు బీదవాళ్ళేట...తండ్రిపోయి చాలా రోజులయిందిట...కట్నాలదగ్గర పేచీవచ్చి పీటలమీద పెళ్ళి పోయిందిట...నలుగుర్లో అవమానం భరించలేకో, లేక తన కోసం తనవాళ్ళు తిప్పలు చూడలేకో...యేమనిపించిందో పాపం...నిండు ప్రాణం తీసుకుంది. ఆడకూతురికి అభిమానం యెక్కువ...అంతకంటె యేం చేయగలదు పాపం! .."

ఆ మాటలు వింటుంటే నా గుండెలు దడదడ లాడినయి. చెవుల్లో అవేఅవే మారు మ్రోగుతున్నయి...మా చెల్లెలు కళ్ళల్లో మెదిలింది. 'నా చెల్లెలు గతికూడా యిలా కాదుగదా...' అనిపించేసరికి ముచ్చెమటలు పోసినయి.

"పెళ్ళికని తెచ్చిన డబ్బు నేను పట్టుకొచ్చాను. పెళ్ళి ఆగిపోతే చెల్లికూడా..." ఇక ఆలోచించలేక పొయ్యాను.... తాళంచెవులు చెల్లెదగ్గరుంటయి. సాయంత్రం నా ప్లాను ప్రకారం దానిదగ్గరి కెళ్ళాను—"చూడు చెల్లీ నా ప్రాణ మిత్రుడికొకడికి పాపం అవసరంగా డబ్బుకావల్సి వచ్చింది. ఒక్క ఐదువేలు సర్దగలిగితే రేపీపాటికి యిచ్చేస్తానన్నాడు. పీకలమీద కొచ్చినప్పుడు సాయం చెయ్యకపోతే యిక స్నేహానికి అర్థమేముంది చెప్పు? ఈ చిన్నసాయం చేస్తే

ఆజన్మాంతం నీ మేలు మరవనని నా చేతులు పట్టుకొన్నాడు. పాపం కాస్తో కూస్తో వున్నవాడే. అన్నమాట ప్రకారం రేఫు తప్పక యిచ్చేస్తాడు. ప్రాణంపోయినా మాటపోనిచ్చేరకనే రకంకాడు.” అంటూ అబద్ధం చెప్పాను.

“అమ్మనడుగుదాం అన్నయ్యా!” అంది.

“ఈ మాత్రందానికి అమ్మనడగాలేమిటి? ఎలాగో రేపిపాటికి తప్పకుండా మనచేతి కొచ్చేదేనాయె.” అన్నాను.

చెల్లె నిజమనుకుంది పాపం. ఎంత నమ్మకంతో ఇస్తే యెంత ద్రోహం తలపెట్టాను! 'నన్నడగకుండా వాడిచేతికి డబ్బెందుకిచ్చావని' అమ్మనిలేస్తే యేమని జవాబుచెబుతుంది. జీవితంలో యిక యేనాటికైనా నన్ను 'అన్నయ్యా' అని పిలవగలదా? నా మాట నమ్మడం అటుంచి స్నేహితుడు ఆపదలో వున్నాడంటే యిచ్చింది. యింత కృతఘ్నత చూపితే వుపకారం మీదనే విశ్వాసం పోదా? నేను చేసిన యీ తుచ్ఛకార్యంతో—మంచిమీద విలువ మనుషుల మీద నమ్మకం పోదా! ఈ కథ యెవరన్నా వింటే యిక—తోబుట్టువులను కూడ అనుమానించరా? మనిషిమీద మనిషికున్న విశ్వాసం సడలిపోదా?...

అసలు—పెళ్ళికితెచ్చిన డబ్బు నేనెత్తుకొచ్చాను..' వారంరోజుల్లో వున్న పెళ్లి ఆగిపోతుంది———నలుగుర్లో అవమానం భరించలేక, అమ్మ అవస్థ చూడలేక అది కూడా యిలాగే!—అదికూడా యిలాగే!.... అమ్మో! అభంశుభం యెరగని దాన్ని దానివేలుతో దాని కన్ను పొడిచాను!...

నమ్మి నా చేతికి డబ్బిచ్చిన దాన్ని దేజేసులా ట్రైలు కట్టుకు అప్పగిస్తున్నానా ??? వీల్లేదు ! అలా జరగడానికి వీల్లేదు ! !— అంటూ అంతరాత్మ ఘోషించింది. స్వార్థంకోసం పరుగులు తీసే మనసనే గుర్రాన్ని కళ్ళెంవేసి బిగించింది అంతరాత్మ... పాపం డబ్బివ్వగానే—'నయమే నా మాటమీద ఆ మాత్రం నమ్మకముంచావు' అన్నాను. 'నువ్వు నన్ను మోసం చేస్తావా అన్నయ్యా?' అంది యెంతో అమాయకంగా. అదే రూపు కళ్ళల్లో మెదిలి అదే ప్రశ్ననిలవేసి అడుగుతున్నట్లుంది ... 'లేదు లేదు' అనుకున్నాను. దుఃఖం ఆపుకున్నా ఆగలేదు. వెక్కి వెక్కి యేడుస్తుంటే పక్కవాళ్ళు వింతగా చూసి ఏవేవో ప్రశ్నలు వేశారు నేను జవాబివ్వలేదు. ఇంతలో స్టేషను వచ్చింది. వానకూడా వెలిసింది. మబ్బులు వీడిన ఆకాశంమీద తెల్లని చల్లని వెన్నెలకాంతులు పరుచు కుంటున్నాయి.

విజయవాడలో ట్రైలు ఆగగానే దూరంనుండి ఓ వ్యక్తి కనిపించాడు. తెల్లని పైజమా, సిల్కులాల్చీ, పైకి దువ్విన క్రాఫు మెడలో సిల్కుమఫ్లర్, కాళ్ళకు గోల్డు ఫ్లెక్సు చెప్పల్సు, ఒక చేతిలో త్రీకాజిల్సు టిన్ను, పిడికిలి బిగించి సిగరెట్ దమ్ములాగుతూ వస్తున్న ఆ వ్యక్తిని విద్యుద్దీపాల కాంతిలో సోము అని పోల్చుకోగానే ఆపాదమస్తకం వణుకు ప్రారంభమయింది. వాడి కంటికి కనబడకుండా బల్లల కింద నక్కాను. వాడు కంపార్టుమెంట్ దాటగానే అవతల వాకిలి

నుండి దిగి బండి చాటు చేసుకుంటూ పక్క పట్టాలమీద పరుగెత్తి కదలబోతున్న గుంటూరుబండి యెక్కాను.

"అంతే—పదేళ్ళ సెలవుగా యీ నాడే మళ్ళీ సోము కన్పించాడు శేఖర్!—నాటికీ—నేటికీ వాడిలో యెంతమార్పు పెద్దగా నిట్టూర్చాను.

ఇంతదాకా పినాకినదీ తరంగాలను చూస్తూ నా కథంతా వింటున్న శేఖర్ సాలోచనగా పలకరిస్తూ "నిజమే రాజా!—జీవిత పథంలో యెప్పుడో ఒకప్పుడు తప్పటడుగు వెయ్యని వాళ్ళే వుండరు. ఏ కొద్ది మంది మహాత్ములో తప్ప కానీ... తప్పును గ్రహించి సరిదిద్దుకో గలిగితే బాగుపడ తారు. లేదా—అలాగే ఆ రొంపిలో యెన్నటికీ పైకి రాలే నంతగా లోతుగా కూరుకుపోతారు. వాడు, సోము అలాగే కూరుకు పోయ్యాడు...." అంటూ దీర్ఘంగా నిట్టూర్చి లే రాజా! చీకటి పడింది.....ఇంటిదగ్గర కనిపెట్టుకుంటారు. పోదాంపద. అంటూ బయల్దేరాడు. నేనూ వాడ్ని అనుస రించాను....

జాగృతి నుండి (16-2-61) పునర్ముద్రితము.

---

# "సర్వధర్మాన్ పరిత్యజ్య...!"

అది సూర్యోదయ సమయం. పూర్వదిశ అనే కోట బురుజుపై నుండి బాలభానుడు తొంగి చూస్తున్నాడు. బృహత్సేన మహారాజు రాచనగరు 'ప్రతాపవిషయ.' మానీరెండలో వింత అందాలను పుంజుకుంటోంది. ఆ పట్టణంలోని, ఆకాశాన్నంటుతూ కన్పించే తెల్లని సౌధరాజాలపై ఉదయసూర్యుని బంగరు లేత కిరణాలు పడి శోభాయమానంగా ప్రకాశిస్తున్నాయి...

ఆ సుప్రభాతాన సఖిజనముల కోలాహలముతో కన్యాంతఃపురము కలకలలాడుతోంది. ఆ అంతఃపురములోని పూజామందిరాంతర్భాగాన చంద్రకాంత మణిపీఠికపై ఓ అతిలోక అపూర్వసుందరి. పదునారేండ్ల ప్రాయము దాటని జవ్వని యొకర్తుక ఆసీనయై వీణ వాయించుతోంది. అభ్యంగన మాచరించి తడియారని నల్లని ముంగురులు ముఖకమలముపై తుమ్మెదల్లా ముసురుకుంటున్నయి. సున్నితములైన ఆ వ్రేళ్ళు వీణ మీటుతున్నాయి. కానీ——ఆమె చూపు మాత్రం మోహన మురళీ గాన విలోలుడు—ఆనంద గోపబాలుని దివ్యసుందర విగ్రహముపైనే నిల్చివుంది. తదేకంగా శ్యామసుందరుని వైపే చూస్తూ వీణ మీటుతుంటే ఆ గాన మాధుర్యం కోకిలలకు సిగ్గు, కిన్నెరలకు తలవంపులు కలిగిస్తున్నట్లున్నది. గానంలో లీనమయి మురళీకృష్ణుని పాదాలకడ

హృదయమనే పూజా సుమాన్ని అర్పించి బాహ్య ప్రపం చాన్ని మర్చిన ఆమెకు రాజదంపతుల రాక తెలియనే లేదు!...

ఆమె ప్రవర్తనచూచి తత్తరపడుతూ ఆ సంగతి నెరి గించాలని ప్రయత్నిస్తున్న సఖిజనాన్ని వారించి మహారాజు కన్నార్పకుండా కుమార్తెవైపు చూడసాగారు. ...ఇంతలో పాట పూర్తయింది. కాని ఆమెమాత్రం నిశ్చలమైన యేకాగ్రతలో మునిగి వుండడం గమనించి ..."కుమారీ! సులో చనా !...." అని పిలిచారు.

ఆమె ధ్యానావస్థ భగ్నమయింది......ఎదుట మహా రాజు !.. తత్తరపాటుతో వీణ నావలనుంచి రాజదంపతుల పాదాలకు ప్రణమిల్లింది. మహారాణి ఆ నందినీదేవి కుమార్తె తల నిమురుతూ, "కుమారీ! ఆ కృష్ణ విగ్రహంవైపు అంత తదేకంగా చూస్తున్నావ్ యెందుకమ్మా!" ఆప్యాయంగా అడిగారు.

రాకుమారి సులోచనాదేవి విగ్రహాన్ని చూస్తూ "ఆ విగ్రహంలో బృందావని కన్పించిందమ్మా!....' ఆ బృందావనిలోని గడ్డిపరకనైనా రాధామాధవుల రాసక్రీడా విశేషాలు చూస్తున్నానమ్మా." అని చెప్పింది.

'ఇంతటి చిన్నవయసులో యెంతటి యేకాగ్రత!' యని ఆశ్చర్యం కలిగింది సహజ విష్ణుభక్తుడగు మహారాజుకు.

"అమ్మా!" మహారాణి కుమార్తెను తన ప్రక్కనే కూర్చుండ బెట్టుకొని..."సులోచనా! యుక్తవయస్కురాల

వైనావు. ఇక మేము విశేషించి చెప్పనక్కర లేదనుకుంటాను. నీ కల్యాణం కళ్ళారా చూస్తే యిక మాకేదిగులు వుండదు. మహారాజు దేశదేశాల యువరాజుల చిత్రపటాలను తెప్పించారు. వీటిని చూచి నీ అభిమతం తెలియచేస్తే తగు ప్రయత్నాలు చేస్తాము. ఇవిగో యివి చూడుతల్లీ." అని ఒక్కొక్క చిత్రపటము తీసి చూపుతోంది.

కానీ—రాకుమారి కన్నులు అటు త్రిప్పనేలేదు. మౌనంగా మాధవుని విగ్రహంవైపే చూడసాగింది. ఆమె వింత ప్రవర్తనను జూచి తల్లిదండ్రులు దిగ్భ్రమ జెందారు... రాకుమారి మౌనంలోని యింగితాన్నెరిగిన ఒక చెలికత్తె కొంత ధైర్యము తెచ్చుకుని..."మహారాజా! క్షమించండి... పరమేశ్వరునికై పరితపించిన పార్వతిలా రాకుమారి హృదయం ఆ శ్రీవల్లభునిపై లగ్నమయివుంది ప్రభూ!... ఆ వేణు గోపాలుని తప్ప అన్యులనెవ్వరినీ వరించనని ప్రతిజ్ఞ పట్టింది.. .ఎప్పుడూ యిక్కడే యీ విగ్రహంకడనే కాలం గడుపుతూన్నది ..మేమెంత చెప్పినా ప్రయోజనం కలుగటం లేదు ప్రభూ!..." అంటూ వినయముమీర అతి నైపుణ్యంతో నెరిగించినది విషయమును.

మహారాజు ప్రశ్నార్థకంగా పుత్రికవైపు చూశారు... రాకుమారి సిగ్గుతో తలవంచుకుంది..."ఎంతటి అల్లుళ్ళకైనా గొప్పవారి ప్రాపుకోరడంలో అసమంజసమేమీ వుండదనుకుంటాను మహారాజా!..." అంటూ సన్నని కంఠంతో మెల్లిగా చెప్పింది.

"అసమంజసమని కాదుతల్లీ. అలభ్యమేమోనని."

"ఎక్కడి వల్లనయ్యా!...ఎప్పుడు దిగిరావటం!!... అంతా నీ భ్రమకాసీ—పిచ్చితల్లీ! మా మాటవిని నిన్ను చేపట్టాలని వువ్విళ్ళూరుతున్న యీ రాజన్యులలో నీకు నచ్చిన వానిని పెండ్లాడి సుఖించుమా!" గడ్డం పుణుకుతూ బుజ్జగించింది మహారాణి.

రాకుమారి మనసు మారలేదు. ఆమె చూపులా విగ్రహం నుండి మరలలేదు..తదేకంగా చూస్తు "ఆ నల్లనయ్య నాపై కరుణించిననాడే నా వివాహం జరుగుతుంది. మీరు విచారించకండమ్మా." అంటూ తన నిశ్చయాన్ని తెలిపింది రాకుమారి. అశ్రుసిక్తాలయిన ఆమె నేత్రద్వయాన్ని చూచి ఆమె మనసు మరల్ప బ్రహ్మశక్యం కాదని గ్రహించి 'శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు' అని దీవించి వెళ్ళిపొయ్యారు రాజదంపతులు.

సజ్జనులైన వారెప్పుడూ సత్కార్యాలను వారిస్తాగే గాని అవరోధించరు గదా!...

* * * *

రాకుమారి నిశ్చయం విన్న రాకుమారులు ఆశాభంగం పొందారు. ఆ నోటా ఆ నోటా యీ విషయం రాజ్యమంతటా ప్రాకిపోయింది. ప్రజలు వింతగా చెప్పుకోడం మొదలెట్టారు...

అది సంజపొద్దువేళ. ఏదో పనిమీద అశ్వారూఢుడయి వెళ్తున్న గాలికుడనే విటుని ఆపి అతడి మిత్రుడు కౌశి

కుడు తన యింటి కాహ్వానించాడు. గాలికునిది ఆజాను బాహు విగ్రహం. విశాలమయిన వక్షఃస్థలం. అందమైన ముఖం, పెద్దపెద్ద కన్నులు. చూపరుల నిట్టే ఆకర్షిస్తయి. ప్రథమ వీక్షణంలోనే మంచి ధీశాలియని, బుద్ధి కుశలత గల వాడని, ఎట్టి కష్టతమమైన కార్యమునైన దీక్షతో నెరవేర్ప గల వుత్సాహ వంతుడనియు గ్రహించవచ్చు.

మిత్రుని ఆహ్వానమందుకుని అతడు అశ్వముదిగి లోనికి వెళ్ళాడు. మిత్రులిద్దరూ కుశల ప్రశ్నల అనంతరం పిచ్చాపాటీ మాట్లాడు కుంటున్నారు...గాలికుడు 'మిత్రమా! యీ మధ్య నీవు బొత్తిగా అగుపించడం లేదేమి?' అని ప్రశ్నించాడు.

"లేదు గాలికా! ఈ మధ్య కార్యార్థినై రాజధానికి వెళ్ళి నిన్ననే తిరిగివచ్చాను."

"ఓహో! ..అలాగా...అయితే రాచనగరు విశేషాలేమిటి?"

"రాచనగరులో విశేషాల కేమి కొదువలే!...కాని - ఒక విశేషము మాత్రము ప్రజలంతా వింతగా చెప్పుకుంటున్నారు."

"ఏమిటంతటి వింతవిషయం?" గాలికుడు వుత్సుకత కనబరిచాడు.

"మన మహారాజు ఏకైక పుత్రిక సులోచనాదేవి రూపురేఖా విలాసాదులగురించి వినిన రాకుమారులు ఆమె

కరగ్రహణాభిలాషులై ఆమెతమ చిత్రపటాలను పంపించారట !"

"అయితే—రాకుమారి అంత చక్కటిదా ?"

"చక్కనిదా ! ఆమెకు సాటిరాగల సౌందర్యవతి యీ ప్రపంచంలోనే లేదట !...ఆమె సౌందర్యం వర్ణించ డానికి వుపమానాలు చాలవట !"

"ఇది నిజమేనా—మిత్రమా ?"

"ముమ్మాటికీ నిజం ! ఆమె ముఖకాంతిముందు పున్నమీ చందమామ వెలవెల బోతాడట !...చక్కని ముక్కుకు సంపెంగరేక సాటిరాదట !...సొగసైన కాటుక రేఖతోడి ఆ కర్ణాంత విశాలనేత్రాలముందు వికసించిన లేడికళ్ళు కనులు బాగుండవేమోననిపిస్తాయట ! ఒత్తుగా, పొడవుగా నిగనిగలాడే నల్లని పట్టుకుచ్చుల వంటి శిరోజములట !... చిగురుటాకులు తాకితే చాలు కందిపోతాయట ఆ సున్నితమైన వేళ్ళు !...నెత్తిమ్మి రేకుల మెత్తదనమునంతా ఒక్కచోట పోగుచేసి బ్రహ్మ ఆమె పాదాలు చేశాడేమోనని పిస్తుందిట ! ..ఇంతెందుకు రతీదేవి రూపము, లక్ష్మీదేవికళ, పార్వతీదేవి తేజస్సు ఆమెలోనే మూర్తీభవించి వున్నాయట! అసలు వొంపు సొంపులతో అందమైన అవయవముల పొందిక చూచితీరాల్సిందేగాని వర్ణించ నలవిగాదంటారు పౌరులు...ఇక విద్యలలో సరస్వతి ప్రతిరూపము !..." కౌశికుడు తానువిన్నది వర్ణించుకు పోతున్నాడు.

ఆమె అంగాంగ సౌందర్యము గాలికుని హృదయ ఫలకముమీద చెరగని ముద్ర వేసుకుంటున్నాయి...ఊహాలలో

రూపకల్పన చేసుకుంటున్నాడు.....అతని వ్యాహాసుందరి అతణ్ని ముగ్ధుడ్ని చేసింది...'ఆమెను తాను భార్యగా పొంద గలిగితే...' అతడి తనువు పులకరించింది...'కానీ ఆమె యే రాజనందనునైనా వరించిందేమో.' నని అనుమానం కలిగి "ఇంతకూ ఆమెను చేపట్టబోయే భాగ్యశాలి యెవరు ?" అని ప్రశ్నించాడు కౌశికుడు.

"నేను చెప్పవచ్చింది కూడా అదే. ఆమె ఆరాజ కుమారుల చిత్రపటాలవైపు కన్నెత్తి చూడనేలేదుట ! శ్రీకృష్ణుని తప్ప మరెవ్వరినీ వివాహమాడనని పట్టుబట్టిందట!! ఎప్పుడూ ఆ పూజామందిరంలో తప్ప బయటకు అడుగు పెట్టడం లేదుట ! పురజనులు యీ విషయమే వింతగా చెప్పుకుంటున్నారు."

కౌశికుని ముఖం వెలవెల బోయింది. మనసు వశం తప్పింది. 'మళ్ళీ కనుపిస్తా.' నని చెప్పి మిత్రునివద్ద శెలవు తీసుకొని తన యిల్లు చేరుకున్నాడు. ఆమె సౌందర్యం తలచు కున్న కొద్దీ పిచ్చెక్కినట్లుగా అవుతున్నది. మాటలలో ఆమెపేరు, కన్నులలో ఆమెరూపు, మనసులో ఆమె దక్క దేమోననే బెంగ తిష్టవేసుకున్నాయి. దినదినమునకూ ఆమె మీద ప్రేమ యినుమడిస్తోంది. ఆమె తలపుకు వచ్చినప్పు డల్లా యేదో తీయని బాధకు లోనవుతున్నాడు. క్రమేపీ అత డికి అన్నపానాదులమీద అయిష్టత వస్త్రాలంకరణలపై విముఖత కలుగుతోంది. అశ్వారోహణపై ఆసక్తి పోయింది. చివరకు పండువెన్నెల మండుటెండగా, చల్లని పిల్లగాలులు వడగాడ్పులు లాగా సోకి అతణ్ని బాధిస్తున్నాయి.

అతడిస్థితి చూచిన మిత్రులు విచారించారు. అందని పండుకై ఆశపడటం మంచిదికాదని యెంతగానో బోధించారు. కానీ అతడి మనసు మారలేదు. ఇక యీ స్థితిలో అక్కడ వుండటం కష్టమనిపించింది. దేశాటనము చేసి వస్తానని మిత్రుల దగ్గర శెలవు తీసుకున్నాడు. మూటాముల్లె సర్ది ప్రయాణమవుతూ, తన యిలవేల్పుకు నమస్కరించాలని పూజామందిరంలో ప్రవేశించాడు. ఎదురుగా శ్రీమన్నారాయణుని విగ్రహం! శంఖచక్ర గదాయుధ ధారియైన గరుడవాహనుడు అతడికేదో ఆదేశించి ఆశీర్వదించి నట్లనిపించింది. వాడిపోయిన అతడిముఖం విచ్చి కలువలా కలకలలాడింది.

"హే జగన్నాటక సూత్రధారీ!... ఈ నాటకానికి నాందీగీతము పాడింది నీవే తండ్రీ! ఇక నా తోడూనీడా నీవే—" అని చేతులెత్తి మ్రొక్కాడు—

అప్పటినుండీ ఒక పక్షం రోజులవరకూ తలుపులు బిగించి యింటిలోపలే కార్యదీక్షలో మునిగిపోయ్యాడు.

మానవులలోని ఆత్మవిశ్వాసం యెంతటి బలీయమైనది?... అదే అతనికి కార్యదీక్షను ప్రసాదిస్తుంది. మేధస్సుకు వుదిపిడి పెడుతుంది...మానవుడికి తన శక్తిమీదగల అపారమైన విశ్వాసాన్నే భగవంతుడు మెచ్చుకొంటాడు కాబోలు!...ఆత్మవిశ్వాసంతో కృతనిశ్చయులై చేసే మానవ ప్రయత్నానికి, అదెంతటి క్లిష్టతమ విషయమే అయినా దైవబలం తప్పకుండా వుంటుంది. అందుకే 'మాన

వుడు తెల్పుకుంటే కానిపని అంటూ' వుండదని' అంటుం టారు.

* * * *

ఒకానొక సుప్రభాతము. గువ్వల కిలకిలలతో తోట అంతా కలకల లాడుతోంది. విచ్చినపూలను గోవిందు పూజకై నెచ్చెలులతో కూడ కోస్తున్నది రాకుమారి. తమ రాజోద్యానవనంలో...ఉదయించే సూర్యబింబంతో పోటీ పడ్తున్నట్లుగా అప్పుడప్పుడే విచ్చుకుంటున్నాయి ఎర్రని మందారపూలు. పువ్వుకంటె సున్నితమైన రాకుమారి వేళ్ళు గులాబీరంగు ముద్దమందార పువ్వుని తుంపుతున్నాయి. విను వీధిని వినబడే వింత సవ్వడికి రాకుమారి తలెత్తి పైకి చూసింది...రానురాను ఆ సవ్వడి దగ్గరయి తమ వుద్యాన వనంవైపే వస్తున్నట్లుంది. చెవులు రిక్కించి వింటున్న రాకుమారి యేదో పక్షి కన్పించింది. ఆశ్చర్యపోతూ పరి శీలించి చూచింది. "గరుత్మంతుడు!...' అనుకుంటూ భక్తి భావంతో తనువు పులకరింప చేతులు జోడించింది. "అరె! ఆశ్చర్యము! ఈ పక్షి నా వైపుకే వస్తున్నట్లున్నది!... కాదు కాదు! ఇక్కడే దిగుతున్నదికూడ... దానిమీద యెవరు?... ఆ ఆశీనుడైనది యెవరు! శంఖ చక్రాయుధధారి సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడు వలెనే వున్నారే.!..." అది సిగ్గో... ఆనందమో...మరి ఆశ్చర్యమో కానీ రాకుమారి క్షణ కాలం అచేతనంగా నిలబడింది...

నీలమేఘచ్ఛాయ, పద్మదళముల వంటి కన్నులు, అర విందముల వంటి పాదములు!...ఆ దివ్యసుందర గాత్రుడు..

ఇన్నాళ్ళు తను యెవరికోసం కాచుకుని వుందో .. యెవరికై రాత్రింబగళ్ళు పరితపించిందో అతడే ఆ నీల నీరదగాత్రుడే యితడు !... ఆహా !... అదిగో పీతాంబరము... ఆనొసమున తీర్చిదిద్దిన కస్తూరితిలకము... చేతనున్నది సుదర్శన చక్రము. ఆ హొంతనే ధగద్ధగాయమానముగా ప్రకాశిస్తున్నది పాంచ జన్యము... సందేహములేదు ! పక్షిరాజు మూపుపై నాకో హించి వచ్చిన యీతడు తన పూజలకు మెచ్చి, నా యందు కనికరించి వచ్చినవాడా దేవదేవుడే !... రాకుమారి తనువు పులకరించింది. ఆ ఆనందంలో ఆమెకు యేమి చెయ్యడానికి పాలుపోలేదు.

ఆమె కలవరపాటు చూచిన గరుడవాహనుడు కొంత దూరమున గరుడునిపై నుండి దిగి ఆ పొదలమాటున అచ్చ టనే వాహనము నిలిపి తానామె చెంతగా వచ్చాడు. తన అభీష్టసిద్ధికై విచ్చేసిన బృందావన నందకిశోరుని చూడగానే రాకుమారి హృదయంలో భక్తిభావం పెల్లుబికింది. తను కోరిన జగదేక మనోహరుడు తన చెంత చేరగానే సిగ్గుతో తెల్లతామర వంటి మోము యెర్రగలువలా మారిపోయింది. పెదవులు సిగ్గుతో వొణికి పోతున్నాయి. మేను కంపించి పయ్యెద జారిపోయింది. ఇంతలో దవ్వున నుండి సవ్వడి విన్న చెలికత్తెలు ఆమెచుట్టూ గుమెగూడారు. అబ్బురపాటుతో అందరూ గోవిందుని పాదపద్మాలపై మోకరిల్లారు ..అప్ప టికి రాకుమారి తన పొరబాటు గ్రహించి తత్తరపాటుతో పరమాత్మునికి ప్రణమిల్లింది. అదిచూచి పున్నమి చంద

మామ లాంటి అతడి మోముపై చిరునవ్వు వెన్నెలలు కాచి నయి... నవ్వుతూ ఆమె చేతిని పట్టుకోబోయాడు. రాకుమారి సిగ్గుతో పక్కకు తప్పుకుంది.

ఉదయకాంతిలో వుద్యానవనంలో వుదయలక్ష్మిలా మెరిసి పోతున్న రాకుమారి సౌందర్యం అతడిని వేగిర పెట్టింది.

"సుందరీ!... నీ ప్రేమపాశంలో చిక్కి వివశుడనై వచ్చిన నేను యీ ఆలస్యము భరించలేను ప్రేయసీ!..." అంటూ దగ్గరకు వచ్చాడు.

తడబడపాటుతో దూరముగా జరిగి చిరునవ్వును పెది మలలోనే దాచుకుని పమిటకొంగు చివర చేతికి చుట్టుకుంటూ "సఖీ! తండ్రిగారికడ కన్యాదానమ్ముగా స్వీకరించుట వుచి తముగదా!..." అన్నది రాకుమారి చెలికత్తెతో.

ఇంతలో యీ శుభవార్త ముందుగా మహారాజు కెరుగజెయ్యాలని వడివడిగా పరుగెత్తిన ఒక చెలికత్తె మహా రాజుకు అంతా నివేదించింది. మహారాజు, మహారాణి పరి వారము అంతా నిర్విణ్ణులయ్యారు. అందరి ముఖాలలోనూ సంతోష సంభ్రమాలు వ్యక్తమవుతున్నాయి. మహారాజు ఆశ్చర్యానికి మేరలేదు. ఎన్నో ఆలోచనలు వచ్చాయి... "గరుడ వాహనుడైన చక్రాయుధధారి తన అంతిపురమునకు వచ్చినమాట నిజమేనా?..." అని సందేహం కలిగింది... 'ఏమో!... ఆ భక్తవత్సలుడు భక్తసులభుడు కదా!... రాకుమారి పూజలకు సంతృప్తుడై దిగి వచ్చాడేమో?...

పార్వతి కతమున పర్వతరాజు పవిత్రుడైనట్లు, సులోచనా జననమువల్ల తను, తన వంశము తరిస్తుందేమో!...' యిలా ఆలోచించుతూ మంత్రి సామంతాదులతో తన వుద్యాన వనం చేరుకున్నాడు.

చుక్కలలో చంద్రుడిలా అంతఃపుర కాంతల నడుమ నున్న శ్రీకాంతుని చూడగానే రాజుకు నవనిధులు లభ్యమైనంత సంతోషం కలిగింది. ఆదిమధ్యాంతాలు లేని అచ్యుతుడు తన యింటి అల్లుడైనాడన్న సంభ్రమంలో తన్నుతాను మర్చిపోయ్యాడు. కడలిరేడు కడిగినపాదాలు తను కడగబోతున్నాడన్న ఆనందంతో సగర్వంగా తన పరివారాన్ని పరికించాడు. భక్తాగ్రగణ్యులకు తప్ప దర్శనమివ్వని దామోదరుని చూడగానే భక్తిభావము పొంగిపొరలి కన్నీటి రూపంలో ప్రవహించగా నతమస్తిష్కుడై అంజలి ఘటించాడు....

* * *

సులోచనా రాకుమారికి, శ్రీమన్నారాయణునికి అతి వైభవంగా వివాహం జరిగిపోతున్నది. 'ప్రతాపవిషయ' నగరమంతటా పచ్చనిపందిళ్ళు, ఎక్కడవిన్నా మంగళ తూర్యారావములు. ఎవరి ముఖంచూచినా అచ్యుతుడే తమ రాచవారింటి అల్లుడైనాడన్న ఆనందమే!...ఎవరు చూచినా కల్యాణ వేదికపై కమలనాభుని చూచి తరిద్దామనే కోర్కెతో పెళ్ళిపందిరివైపు పరుగులెత్తేవారలే!...తృణమో ఫణమో చాలు భగవద్దర్శనమునకని తమ శక్తికొలది కానుకలర్పించ

డానికి ఆరాటపడుతున్నారు. దేశదేశాలనుంచి వచ్చిన రాజులతో పెళ్ళిపందిరి నిండివుంది...... ఆ నిత్యకల్యాణునకు కల్యాణం జరిగిపోయింది.

తనబిడ్డపై మాకులుతో వైకుంఠమునే వీడివచ్చిన వాసుదేవుని తనయింటనే వుండిపొమ్మని మనవి చేసుకున్నాడు మహారాజు. అల్లుడు అంగీకరించగానే యిక నా పురమే వైకుంఠమని మురిసిపోయ్యాడు.

*    *    *

మనోహరమైన వెన్నెల శయ్యామందిరమంతటను వ్యాపిస్తున్నది. మత్తుకలిగించే పరిమళ ద్రవ్యాలు గదిలో వింతివాసనలు వెదజల్లుతున్నాయి. మున్నెన్నడూ కనీవినీ యెరుగనంతటి అందముగా అలంకరించబడిన శయన మందిరంలో రాకుమారిని భర్తకడకు తీసుకువెళ్ళారు చెలికత్తెలు. నునుసిగ్గు మెరుగులతో అపరంజి బొమ్మలావున్న రాకుమారిని గదిలోపలకుత్రోసి తలుపులు బిగించి కిలకిలమని నవ్వుకుంటూ వెళ్ళిపొయ్యారు.

వెన్నెలరేడును చూస్తూ ప్రేయసికోసం తపించిపోతున్న అతనికి రేరాజునుత్రోసిరాజన్నట్లుగా వున్న ప్రేయసీ వదనము కన్పించింది ఆమె నుదుటపైనున్న కస్తూరీ ఘుమఘుమలు గుబాళించినయి. సిగలోని సన్నజాజులు సన్నగా నవ్వినయి. ఆ పరిమళం చల్లని చంద్రకిరణాలకంటె సొంపుగా అతనికి మత్తుకలిగించింది. ప్రియురాలి ముగ్ధ

మోహన రూపము గాంచిన అతడిమేను పులకరించి అను రాగం వెల్లివిరిసింది.

ఘనమైన కుచముల భారముతో సన్నని నెన్నడుము మరింత అల్లల్లాడ మొలనూకి చిరుగజ్జెలు గలగలమని సందడి చేయ భర్తను సమీపించింది సులోచనాదేవి. వంగి భర్త పాదాలకు నమస్కరించిన ఆమె హృదయంలో భక్తి, ప్రేమ భావాలు పొంగిపొరలి తనువు గగుర్పొడిచింది. ఓరగంట భర్తనుచూస్తూ "స్వామీ !— —తాపసోత్తములకు గూడ తాకనలవిగాని యీ పాదార వింధములను కన్నుల కద్దుకో మంటారా ?—పెదవుల ముద్దుగొనమంటారా ?—" మృదువుగా అడిగింది.

"ఏదీ చెయ్యవద్దు దేవీ !..." ప్రేమతో పాలరాతి పలకల్లాంటి ఆమె చెక్కిళ్ళు నిమురుతూ అన్నాడు.

"ఏమో !..." ఆశ్చర్యంతో ఆమెకన్నులు మరింత పెద్దవయినయి.

"కన్నుల కద్దుకుంటే విచ్చిన ఆ కలువ రేకులు వాడి పోతయి...ముద్దుగొంటే ఆ లేత కెంజిగురాకులు కమిలి పోతయి..."

ఆ మాటకు ఆమె తియ్యగా అమృతం జాలువారేలా నవ్వింది.

"పాల్కడలి గారాబుపట్టి పట్టిన పాదాలకడ యీ దాసికి యింత చోటిస్తే చాలు ప్రభూ !..." మృదువుగా పాదాలు స్పృశిస్తూ అంది.

"కానీ—నా ప్రాణేశ్వరిస్థానము పాదాలకడ కాదు... ఇక్కడ... ఈ హృదయంలో దేవీ!" అంటూ ఆమెను లేవ నెత్తి బిగికౌగిట బంధించబోయ్యాడు. లేడిపిల్లలా దూసుకు పోయి గిన మృదువైన అరుణారుణ హస్తములో కెంపులు పొదిగినంత అందంగా మెరుస్తున్న బంగారు క్షీరపాత్రను తెచ్చి అందిస్తూ "క్షీరసాగర శాయికి..." ముత్యాల పలు వరుస తళుక్కున మెరియ చిరునవ్వులొలికిస్తూ చతురోక్తిగా అంది.

"ప్రియురాలి ప్రేమామృతమునకు యేదీ సాటి రాదుగా!..." నవ్వుతూ అందుకుని ఆమెను దగ్గరగా తీసు కున్నాడు.

వారి అన్యోన్య దాంపత్యముసుఖంగా సాగిపోతున్నది. తాను మనసారా కొలిచిన దేముడే తన నాధుడైనాడన్న తలపుతో రుక్మిణీకాంతలా భక్తిభావంతో భర్తను సేవి స్తోంది సులోచనాదేవి. సత్యభామను మించిన ప్రేమాతి శయంతో భర్తను ఆనందాబ్ధిలో ఓలలాడించి తన వాడిన్న చేసుకుంది. మనసైన యిల్లాలిప మక్కువతో చూచుకుంటు న్నాడు భర్త.

మహారాజుకు, ప్రజలకు ప్రతిక్షణం గోవిందుని స్మరణ యెక్కువయింది. ఆ ఆదిదేముడి అండతో కొండంత బలం వచ్చింది, మహారాజుకు. అందరిలోనూ నూతనోత్సాహం వెల్లుబుకుతోంది. సైన్యంలో శౌర్యధైర్యాలు పెంపొంది నయి. సర్వ జగద్రక్షకుడే తమవాడన్న విశ్వాసం చేకూరితే

మానవమాత్రులకు యేనుగంత బలంరావడం సహజమేగదా! దేశదేశాల రాజులు కూడ మహారాజుకు అమూల్యమైన కానుకలు సమర్పిస్తున్నారు.

కాలం గడుస్తున్నది. క్రమంగ మహారాజుకు అహం భావం పెచ్చుపెరిగింది. ఇరుగుపొరుగు రాజన్యులు తమ యందు చూపుతున్న గౌరవాదరాలను లోకువగా భావించిన మహారాజుకు ఆశపుట్టింది. జగత్ప్రభువునే తన జామాతగా చేసుకోగలిగినపుడు యీ ధరణినంతా నాదిగా యెందుకు చేసుకోగూడదు ? అనిపించింది. క్రమంగా తన యిరుగు పొరుగు రాజ్యాలను కబళించడం మొదలుపెట్టాడు.

నిజానికి—పిరికితనం మనిషిని సగం నీరసింపచేస్తుంది? సాక్షాత్తూ ఆ జగత్ప్రభువే కదనరంగములో నిలిస్తే యెదు రిచ్చి నిలబడగల సామర్థ్యం యెవరికుంటుందని యెవరిదోవన వారు పలాయన మంత్రం పఠించారు కొందరు రాజులు, అది విన్న మరికొందరు బృహత్సేన మహారాజు తమమీదకు దాడివెడలబోతున్నాడని తెలియగానే పరారయిపొయ్యారు. ఎదురు నిల్చిన ఒకరిద్దరు యోధులూ "యింతమంది ఇలా వెన్నిచ్చి పారిపొయ్యారంటే అతడు మహాబలశాలై వుండాలి. ఇంతిమదికి సాధ్యంకానిది నేనొక్కడినే యెదురించ బూనడం యేటికి యెదురీదినట్లు వృథాప్రయాసే అవుతుంది... అనువు గానివేళ అణగివుండి సమయమురాగానే కబళించడం వుత్తమ మయిన రాజనీతి!..." అని తలపోసి తమదోవ తాము చూసుకున్నారు.

ఆ విధంగా సునాయాసంగా లభ్యమైన ఆ సువిశాల సామ్రాజ్యాన్నంతటినీ తన యేలుబడి క్రిందకు తెచ్చుకుని నిరాటంకంగా పాలిస్తున్నాడు బృహత్సేన మహారాజు.

*    *    *    *

కొన్ని యేళ్ళు అలాగే గడిచిపోయినయి—అడవుల పాలయిన రాజులంతా యాదృచ్ఛికంగా ఒక్కచోట కూడటం తటస్థించింది. ఒకరినొకరు చూచుకుని ముందు నివ్వెరపోయారు. తర్వాత ఒకరి విషయాలు ఒకరు తెల్సుకుని తమాందరికీ ఒకే విపత్తు వచ్చినందుకు ఖిన్నులయ్యారు. అందులో యెవ్వరూ యెదురునిల్చి పోరలేకపోయి కారడవుల పాలయినందుకు అందరికి తలవంపులుగా వుంది. వారందరి హృదయాలలోనూ అణగారిపోయిన పరాభవాగ్ని రాజుకుంది. తమతమ గుండెల్లోదాగిన బాధను అందరూ వెలిబుచ్చుకున్నారు

"రాజ్యంపోయింది. రాజసుఖభోగాలు పోయినయి. కీర్తిప్రతిష్టలు మంటగలిసినయి. అన్నీ పోగొట్టుకుని, అవమానం భరించి యిలా జీవచ్ఛవంగా బతికేకంటే చని పోవడం వుత్తమం." అంటూ విలపించారు కొంతమంది.

"చచ్చి సాధించేదేముంది! గడ్డిపోచలన్నీ కలిపితే మదపుటేనుగునే బంధించవచ్చు. అలాగే మనమింత మందిమి యేకమై యుద్ధభూమిలోనికొస్తే మనలను అడ్డేవారేవుండరు" అంటూ ప్రోత్సహించారు కొంతమంది, ఆశావాదులువుడుకు రక్తపుపొంగులో...

"ఆఁ...ఎంత యేకమైనా—లోకరక్షకునితో వైరం పెట్టుకోడం అంటే మాటలా!" అంటూ పెదవివిరిచారు, జవసత్వాలుడిగిన కొంతమంది నిరాశావాదులు.

అందరిలోకీ బుద్ధిబల సంపన్నుడూ, శౌర్యధురంధరుడు అయిన ఓ వివేకవంతుడు వాదోపవాదాలనుఆపి శత్రువుకు వెరచి వెన్నిచ్చి పారిపోడం రాచకులంలో పుట్టిన మనకు సిగ్గుచేటు! 'జాతస్యహి ధ్రువో మృత్యుః' పుట్టిన వాళ్ళు గిట్టక మానరు. శత్రువుకు భయపడి యీ కారడవులలో ఆకులలములు తిని చావలేక బ్రతికేకంటే రణరంగలోనే ప్రాణాలు విడుద్దాము. ఉత్తమగతులయినా లభిస్తయి. అందులో గెలిచామా సర్వదా జయప్రదుడగు ఆ దేవదేవునే జయించిన కీర్తిదక్కుతుంది. మరణించినా సాక్షాత్తూ శ్రీహరిచేతిలో చావు యెంతటి పుణ్యాత్ములకు లభిస్తుంది!.. అసలు చందన తరువు తన నీడనుచేరిన నరులేగాని, నాగులేగాని అందరికీ సమంగా సుగంధాన్నిస్తుంది. ఆజగద్బాంధవుడూ అంతే!... శత్రుమిత్ర భేదంగాని, స్వపర తారతమ్యంగా స్వార్థలంపటులైన మానవులకుగాని ఆ దీన బాంధవుడికివేమీ వుండవు. అన్నిటికన్నా పైన మామగారి మర్యాద నిలబెట్టడానికి ఆ శ్రీమన్నారాయణుడు యుద్ధానికిదిగినా ఆ దివ్య సుదర్శన చక్రముచేత నిహతులైనవారికి యిక యీ చావు పుట్టుకలే లేని మోక్షసామ్రాజ్యం లభిస్తుంది. — అదీగాక మనం యోధులుగా పుట్టాం! యోధులుగా పెరిగాం! యోధులు

గానే మరణిద్దాం. అంటూ చక్రనిసలహా యిచ్చాడు. అందరూ సరేనంటే సరేనన్నారు.

*    *    *    *

పరాజితులయి పరార్తైన రాజులందరూ, ఆటవికుల సామంతో ఒక్కుమ్మడి దండెత్తివచ్చారన్న వార్త ప్రతాపవిషయ నగరమంతటా కలకలం లేవదీసింది. ఇంత కాలం భక్తి, వినోద కాలక్షేపాలలో మునిగి తేలుతున్న ప్రజానీకంలో సంచలనం కలిగింది. కానీ—బృహత్సేన మహారాజు వీసమంతైనా చలించలేదు. తటపటాయిస్తున్న మంత్రి సేనానులకు "పరిపూర్ణ భగవదనుగ్రహ పాత్రులమైన మనకు కలలో కూడ భయం అనవసరం! వీరే కాదు! ఇంతకురెండింతలు మంది కూడివచ్చినా మనం భయపడనవసరం లేదు! కండకావరంతో మనపైనే కత్తికట్టిన వీరందరికి తగిన శాస్తి చేసి తీరవలసిందే! పదండి!..." అంటూ ప్రోత్సహించి చతురంగ సేనావాహినితో ధీమాగా రణరంగానికి నడిచాడు.

పోరు ఘోరంగా జరుగుతోంది. మహారాజు, వారి సేనలు ఎంతో శౌర్యధైర్యాలు ప్రదర్శించారు. కాని వుప్పెనలా ముంచుకువస్తున్న అరివీరుల నాపలేకపోతున్నారు. చెల్లాచెదరైపోతున్న సైన్యం, విరిగిపడిన రథచక్రాలు, చచ్చిపడున్న యేనుగులు, గుర్రాలు, మృతకళేబరాలు, గాయపడి ఆక్రోశిస్తున్న సైనికులతో యుద్ధభూమి అతి భయంకరంగా వుంది. అసంఖ్యాకమైన శత్రుసేనలు కోలాహలంతో ముందుకు తోసుకొస్తున్నాయి. అదిచూచిన మహా

రాజుగుండె జారిపోయింది. అహంభావం పూర్తిగా నశించింది. ఇక యీ పరిస్థితిలో సర్వజగద్రక్షకుడైన తన అల్లుడు తప్ప తన్ను రక్షించగల వారెవ్వరూ లేరు. ఆ ఆపద్దేముడు తనను తప్పక కాపాడుతాడు. సందేహం లేదు అనే దృఢ విశ్వాసంతో పరుగుపరుగున తన అంతఃపురి చేరుకున్నాడు.

సరస సల్లాపాలలో ఆనందసాగరంలో మునిగివున్న సులోచనా దంపతుల కింతవరకూ యీ విషయమే తెలియదు. తన కుమార్తెను పిలిపించి పరిస్థితి అంతా చెప్పి "ఈ స్థితిలో నీ నాథుడైన జగన్నాథుడే మనల నాదుకోవాలితల్లీ! ఇంక అతడేమనకు శరణ్యం!" అంటూ తెలియచేశాడు మహారాజు.

తండ్రికి వచ్చిన ఆపదవిన్న రాకుమారిమనసు చాలా బాధపడింది. ఇలాంటప్పుడు తండ్రిని ఆదుకోకపోతే యిక తన బ్రతుకే వృథా అనిపించింది. వెంటనే భర్తదగ్గరకువెళ్ళి పరిస్థితిఅంతా వివరించి, "ఆపదలోనున్న మా తండ్రికి తోడు పడటం మనవిధికదా!" అంటూ మనవి చేసుకొంది. కాని— ఆ మాటవినగానే భర్తమొగంలో వచ్చిన మార్పు చూచి ఆమెకు దుఃఖం ఆగలేదు. భర్త పాదాలపై వాలి కన్నీటితో అభిషేకించింది. చేతులు మోడ్చి "హే భగవాన్! ఆర్తత్రాణ పరాయణా!! హేదీనబాంధవా!!... రక్షించు! రక్షించు!!...'ఇందుగల డందులేడని సందేహము వలదం...' నీ శాలభక్తుడు పలుకగానే స్తంభములో సాక్షాత్కరించి ప్రహ్లాదునిమాట వట్టిమాట కాకుండా

కాపాడలేదా!...నిండుసభలో మానభంగం జరుగబోతుంటే 'అనాథ! శరణు! శరణు!' అంటూ వేడిన ద్రౌపదికి అక్షయమైన వలువలిచ్చి ఆదుకోలేదా!...'పాహిపాహి' యన్న గజేంద్రుని మొరవినగానే యిల్లాలికిగూడా చెప్పకుండా పరుగున పోయి ప్రాణరక్షణచేసిన ఆపద్బాంధవుడవే!...నిరంతరం నీనామస్మరణలోనే కాలం గడుపుతున్న నా కన్నతండ్రిపై కనికరించలేవా? ప్రభూ! చివరికి నీ యిల్లాలి ప్రార్థననైనా ఆలకించవా...'' అంటూ కన్నీరు మున్నీరుగా విలపిస్తున్న భార్యను చూడగానే అతడిమనసు కరిగిపోయింది. ఆమెను లేవనెత్తి కారే కన్నీరు తుడుస్తూ "దేవీ! వూరడిల్లుము. నీ తండ్రికి తప్పక సాయంచేస్తాను. ఇక నీవు నిశ్చింతగా తండ్రికడకేగి ఆయనకు ధైర్యము చెప్పు. నేనిప్పుడే పోయి అరిమూకలను చెల్లాచెదరుచేసి వచ్చెదను." అంటూ ఓదార్చి మాటయిచ్చి పంపివేశాడు.

సులోచనాదేవి తేలికపడ్డమనసుతో వెళ్ళిపోతుంటే అతడి గుండెలు బరువెక్కినయి. ఈ విపత్తునుండి తప్పించుకోడమెలాగన్నది అతడికి పెద్ద సమస్యయింది. ఏమిచెయ్యడానికి పాలుపోలేదు. 'ఇక తనరహస్యం బయటపడక తప్పదా ఇన్నాళ్ళూ సాగిన యీ నాటకానికి యింతటితో స్వస్తి చెప్పాలా? అయినా—ఈ స్థితిలో అసలు రహస్యం బయటపెట్టినా లాభమేముంటుంది? ఇన్నాళ్ళు భక్తిప్రేమలతో చూచిన భార్య, ఆదరాభిమానాలతో గౌరవించిన మామ వీరిందరి అభిమానం పోగొట్టుకోవడమే కాకుండా బయట

పెట్టినందున తనను నమ్ముకున్న వీళ్ళకు కలిగేమేలు యేముంటుంది? పైగా శత్రురాజులు లోకువకట్టి మమ్మందరినీ యమపురి కంపరా?... పోనీ—అలాకాక... తను పారిపోతే.. ఛీ!...ఛీ! తనవారినందరినీ శత్రువులచేతి కప్పచెప్పి తను పిరికిపందలా పారిపోవడం?...అది జరగనిపని! ఏదిఏమైనా కాని యీ స్థితిలో ఆయుధధారినై యుద్ధభూమికి వెళ్ళటమే కర్తవ్యం. ధైర్యసాహసోపేతుడైన పురుషునికే దైవబలం కూడ వుంటుందని, విజయలక్ష్మి వరిస్తుందని పెద్దల నానుడి ఆనాడు భగవంతునిపై భారంవేసి నాడు చేసిన తెగువకు యిట్టి అపురూపసుందరి భార్యగా లభించింది. నేటి తన తెగువకు కూడ మెచ్చి ఏ భగవంతుడో సాయపడకపోతాడా? సాయపడక మరణమే లభించినా యుద్ధంలో మరణం అదెంతటి పుణ్యాత్ములకు లభిస్తుంది.. వెనక శ్రీకృష్ణపరమాత్ముడే నుడివినట్లు 'హత్వావా ప్రాప్స్యసి స్వర్గం; జిత్వావాభోక్ష్యసే మహీమ్.' అని తర్కించుకుంటున్న గాలికునికి 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ!' అన్న గీతాసూక్తి జ్ఞాపకం వచ్చింది. 'తండ్రీ! నేచేసిన అపరాధముల క్షమించు యికనాకు నివ్వేదిక్కు! పాహి! మాంపాహి!...' అంటూ ప్రార్థించి అచంచలమైన విశ్వాసంతో యుద్ధ సన్నద్ధుడవుతున్నాడు గాలికుడు.

*　　*　　*　　*

అక్కడ వైకుంఠపురిలో చలువరాతిమేడలో కేళీ
మందిరంలో [illegible]

గోవిందుడు "పాహి ! మాంపాహి !!". అన్న భక్తుని కేకవిని ఉలిక్కిపడ్డాడు. అకస్మాత్తుగా మౌనంవహించి ఆలోచనలో మునిగిపోయిన యిందిరాదేవికి ఏమీ అర్థంకాలేదు. దీనజన రక్షకుడైన తన నాథుడు అన్యమనస్కుడవడానికి యే భక్తుడి ఆర్తనాదమేమైనా విన్పించిందేమో ? లేక 'రక్షింపు రక్షింపు' మనే గోబ్రాహ్మణ స్త్రీజనాలాపము లేవైనా వినపడ్డవేమో ?' నని సంశయించిన రమాదేవి 'స్వామీ ! యీ పరాకుకు కారణమునేను తెలుసుకోవచ్చునా ?' యని ప్రశ్నించింది. దేవీ ! భూలోకంలో బృహత్సేనుడనే మహారాజు యేకైకపుత్రిక సులోచనాదేవి అందాల భరిణె. చిన్ననాటి నుండి నా పాదసేవా తత్పరురాలై నన్నుతప్ప మరెవ్వరినీ పెండ్లియాడనని పట్టుబట్టింది. ఆమె ప్రతిజ్ఞవిన్న గోళికుడనే ధీశాలియొకడు ఆమెను భార్యగా పొందాలనే కాంక్షతో బుద్ధిసూక్ష్మత నుపయోగించి కొయ్యతో నొక గరుడు వాహనమును జేసి అందొక కీలమర్చి దానిని కోరినప్పుడు ఆకాశములో నెగురించురీతిగా నిర్మించి చూపరులకు ఖగేంద్రునివలె కన్పించునట్లు నిర్మించినాడు. ఉక్కుతో సుదర్శన చక్రములా రూపొందించినాడు. తాను పట్టుపీతాంబరముగట్టి ముఖమున వూర్ధ్వపుండ్రములు దిద్ది యంత్రగరుడినెక్కి చేత చక్రముబట్టి రాకుమారి వుద్యానవనమున ప్రత్యక్షమయినాడు. అతడినే నన్నుగా నమ్మిన మహారాజు కన్యాదానము చేసి జన్మతరించిందని సంతసించినాడు.

"కానీ, యిప్పుడు మహారాజు ఘాటికాగలేక జారుకున్న రాజులంతా ఏకమై మహారాజును ముట్టడించారు.

గత్యంతరములేక తన అల్లుడిని నేనుగా భావిస్తున్న రాజా అతడి సహాయమర్థించాడు. దిక్కూతోచక గాలికుండు 'పాహి! మాంపాహి' అంటూ మొరపెట్టుకుంటున్నాడ"ని సవిస్తరంగా తెలియచేశాడు రమాపతి.

శ్రీదేవి కనుబొమలు ముడివడ్డాయి. "నాథా!... కపటవేషము వేసిన మాయావి మాటలను వారెలా నమ్మగలి గారు?... ఎంతటి తెగింపునాన్న దివ్యమంగళస్వరూపులయిన శ్రీకాంతుని వేషము వేసి నమ్మించిన ఆ ధూర్తుని కెంత సాహసం!!... ప్రభూ! అట్టి వంచకుని మీరు క్షమించవ వలదు..." అంటూ రోషకషాయిత నేత్రాలతో పలికింది.

ముకుందుడు మందహాసంచేశాడు. "దేవీ! శాంతిం పుము... నిజంగా అంతమందిని నమ్మింపగల్గడం అతడి ప్రజ్ఞా విశేషమే! అంతేకాదు కార్యార్థియై కపటవేషము వేసినాడు గాని నన్నెన్నడూ ధిక్కరింపలేదు, కించపరచలేదు. పైగా హృదయములో నాయందే భక్తినిలుపుకున్నాడు... దేవీ! ప్రేమికులకు తమ ప్రియుల లోపాలోపములతో ఏవిధముగా పనిలేదో నాకూ భక్తుల భక్తిభావముతో తప్ప యితర లోపముతో పనిలేదు. అదేకాక—సులోచనా రాకుమారి చిన్నతనమునుండీ నా నామ స్మరణలోనే కాలంగడపింది. నాకే హృదయమర్పించింది. తన భర్తను నేనేనని నమ్మి హృదయకమలములో నా మూర్తినే ప్రతిష్ఠించి మనోవాక్ రూపముల నన్నే పూజించింది. ఆ భక్తురాలిని రక్షించడం నా కర్తవ్యం నేనే తమ అల్లుడినన్న భావంతో భక్తిశ్రద్ధ

లతో, ఆదరాభిమానాలతో సేవించి, కొంతంత నా అండనే సుగాసుకుని మురిసిపోయిన ఆ ముసలిదంపతులను, ఆ దేశ ప్రజలను ఉపేక్షించడం ధర్మంకాదు.' అంటూ శ్రీమన్నా రాయణుడు నచ్చచెప్పాడు యిందిరాదేవికి. కానీ ఆమె యింకా చిన్నబుచ్చుకుని వుండడం గమనించి మధుర మంద స్మిత వదనార విందుండగుచు శేషశాయి తిరిగియిలా చెప్ప సాగాడు.

"దేవీ! నా స్వరూపం నీకింకా అవగతం కాలేదా? భక్తివిశ్వాసాలతో రాతిలోవున్నది నేనేనని భావించి పూజించే భక్తులకు ఆ రాతిలోనే నేను సాక్షాత్కరించుట లేదా? అన్నిటికి ముఖ్యమైనది భక్తిగాని సాధనముగాదు! ఇంకొక చిన్నవిషయమునుగూడ ఆలోచించు దేవీ! 'విజయమో! వీరస్వర్గమో!' అని ధృఢనిశ్చయంతో కదన రంగానికి కదిలిన గాళికునకు మరణమే సంభవిస్తే అతడే నే ననుకుంటున్న లోకులు శ్రీహరే మరణించాడనుకోరా? అనంతునే అంతమొందించామనే అహంభావంతో విజయ లక్ష్మియుతులైన శత్రువర్గాలు పాపభీతిలేక యిచ్చమొచ్చినట్లు సంచరింపరా?......అసలు, ధైర్యసాహసములతో అచంచల ఆత్మవిశ్వాసంతో చేసే మానవుని ప్రతి ప్రయత్నానికి దైవబలం వుంటుందన్న సంగతి నీకు తెల్సుగదా దేవి! ఏది ఏమయినా కానీ శరణన్నవారిని చేపట్టడం నా విధి! 'దిక్కు నీవేనని' నమ్ముకున్నవారికి దిక్కు చూపడం నా ధర్మం! ఇక నేను యుద్ధభూమికి బయలుదేరక తప్పదు." అంటూ

శంఖ చక్రాయుధధారియై ఖగరాజునెక్కి కదనరంగానికి బయలుదేరాడు శరణాగతవత్సలుడు.

* * * *

రిపువీరుల రక్తపు మడుగులతో భయంకరంగావున్న రణరంగానికి గాలికుడు చేరుకునేసరికి నలువైపులా జయజయ శంఖారావం వినిపించింది. శత్రురాజులలో శేషజీవి ఒక్కడూ లేడు! గాలికుడు విస్మయంతో నలుదైపులా పరికించాడు. దూరంగా పాంచజన్యము పూరిస్తూ చక్రాయుధధారియైన గరుడవాహనుడు కనిపించాడు. ఇదంతా ఆ కృపామయుని కరుణా విశేషమేనని చేతులెత్తి మ్రొక్కుతున్న గాలికుని మందహాసంతో దీవిస్తూ అంతర్ధానమైనాడు అచ్యుతుడు....

(జాగృతినుండి పునర్ముద్రితం.)



# ఆరిపోయిన అగ్గిపుల్ల దీపం వెలిగించింది!

"అమ్మగారూ !..."

... ...

"అమ్మగారూ !... శాంతమ్మగారూ ! లెగండమ్మా పండగపూట బోలెడు పనుంది." అంటూ తలుపుతట్టింది పని మనిషి.

"ఆఁ... ఆఁ... అబ్బబ్బ ! వస్తున్నానుండు." కళ్ళు నులుపుకుంటూ లేచి తలుపుతీసి "యింకా నాలుగయినా కాలేదు. అప్పుడే వచ్చావేంలచ్చీ?" అని అడిగింది శాంత.

"అదేందమ్మగారూ ! ఇయ్యాల నరకచతురదసి పండుగ గదమ్మా. తెల్లారకట్టనే తలంటోసుకోవాలగా.... ఇప్పటికే పొద్దోయింది. నిన్న యిల్లుగూడ కడగలేదు. ఎప్పటికవాలో పనంతా అనినేను యిదయితుంటే... అగ్గిపెట్టె యిట్టా పడెయ్యండి. పొయ్యిరాజేసి పాచూడుస్తాను."

నిర్మలమైన సరస్సులో రాయివిసిరినట్లయింది శాంత హృదయంలో. కలతచెందిన మనసుతో "అప్పుడే నీళ్ళకేమీ తొందరలేదులే. నువ్వు పాచిపనిచేసుకో." అనిచెప్పి మళ్ళీ వచ్చి పక్కమీద మేనువాల్చింది. అయినా నిద్రపట్టలేదు. ఏవేవో జ్ఞాపకాలు తరుముకొస్తున్నాయి.

...అవి తను చిన్నపిల్లగా వున్నరోజులు. దీపావళి పండుగ వస్తోందంటే నెలముందుగానే యింట్లోసందడి మొదలయేది. మందుసామాన్లు యింట్లోనే తయారుచేసుకునేవాళ్లు. అన్నయ్యలు, చినాన్నలుఅంతా పోటాపోటీలుపడి బాణా సంచాతయారు చేసేవాళ్ళు. ఎవరింట్లో యెక్కువ మందు సామాను కాలుస్తారో వాళ్ళకు గొప్పగావుండేది. ఆ వూళ్లో కూడా అంతా 'ఫలానావాళ్ళింట్లో యెంతమందు కాల్చారని' అంటూ గొప్పగా చెప్పుకునేవాళ్ళు. తనకు అన్నయ్యతోబాటు చిచ్చుబుడ్లలో మందుకూరడమంటే సరదాగా వుండేది. కానీ అన్నయ్యలు తనను వాటిదగ్గరకు రానిచ్చేవాళ్ళుగాదు. నాన్నతో చెప్పుకుని యేడ్చి గోలచేసేదితను .. ఒకమాటు నరకచతుర్దశికి.. ఎవరు ఉదయముందు తలంటి పోసుకుంటారోనని పోటీలుపడ్డారు పిల్లలంతా...అయి దేళ్ళ తను అమ్మతో ముందునన్ను లేపమనిచెప్పి నిద్రపోయింది. మెలకువ వచ్చేసరికి తలతుడుచుకుంటూ అక్కయ్య "ఫస్ట్ శాంతా! నేను శ్రీ, అన్నయ్య మక్కు; నువ్వుదెబ్బ." అంది. ఇంతలో అప్పుడే తలంటుకానిచ్చికొని పీళ్ళ గదిలోనుండి వస్తున్న అన్నయ్య "ఫస్టు పార్వతి, సెకండు చక్రవర్తి, థర్డు తాటికాయ!" అంటూ గేలిచేశాడు. ఇక తను వుడుకుమోతుతనం పట్టలేక యేడుస్తూ 'యివ్వాళ నేనసలు తలంటే పోసుకోను' నని మారాంచేసింది. అప్పుడు నాన్న బుజ్జగిస్తూ "ఈ మాటుసంక్రాంతి భోగినాడు అందరికంటె నిన్ను ముందు లేపుతాను నేను. అప్పుడు వీళ్ళనే నువ్వు 'తాటికాయలన్న'

చేద్దువుగానిశే." అంటూ బ్రతిమాలితే అప్పటికి లేచింది తను...

ఎంత మధురమైన రోజులవి అనిపించింది శాంతకు. చిన్నతనంలో ఆ వురకలువేసే వుత్సాహం, ఆ అర్థంలేని పట్టుదలలు తల్చుకుంటే యిప్పుడు నవ్వొస్తోంది. కష్టసుఖాలకు అతీతంగా, చీకుచింతలకు దూరంగా అందమైన దీవిలోని ఆనందాలరంగులీనే చక్కని భవంతిలాంటిది చిన్నతనం... మళ్ళీ ఆ రోజులువస్తే యెంతబాగుండుననిపించింది శాంతకు. మధురమైన గతంలో విహరిస్తున్న శాంతకు తనపక్కనే పడుకున్న యిద్దరుపిల్లల్నీ చూడగానే బాధకలిగింది. ఈ పసి మనసుల్లోనూ అదే వుబలాటం వుండుంటుంది... కానీ... బరువుగా నిట్టూర్చింది శాంత.

మళ్ళీ గతస్మృతుల కెరటాలు శాంత మనసును ముంచేసినయి... ఒక సంవత్సరం నాయనమ్మ చనిపోయిన సంవత్సరం అది. పెద్దలుపోయిన యేడు పండుగ చెయ్యకూడదంటూ ఆ యేడు యే పండుగా చెయ్యలేదు. "అమ్మా! తలంటే" అంటూ తనూ తమ్ముడూ, చెల్లెలూ ఒకటే ఆగం చేశారు. అమ్మ తమనికోప్పడుతుంటే నాన్నవచ్చి "పోనిస్తూ పిల్లలకేం తెలుసు పాపం. వాళ్ళ ముచ్చట యెందుకు తీర్చక పోవడం?" అంటూ తలంటిపోయించి మిఠాయిలు కొని పెట్టారు. టపాకాయలు పక్కింట్లో కాల్చుకోమని పంపించారు...

"అమ్మగారూ!" మళ్ళీ లచ్చిపిలుపుతో శాంత ఆలోచనా స్రవంతికి ఆనకట్ట అడ్డంపడింది.

"పండుగపూట ... ఇంకా నిద్దరేంటమ్మగారూ... లెగండి... లెగండి... పాచిపనయింది... పోయిరా జేస్తాను."

"వేరేయింటికి వెళ్ళి పనిచేసుకురాపోలచ్చీ !"

"అదేంటమ్మా....యిల్లుగడగాలి... ముగ్గులెట్టాలి... అబ్బాయిలకు తలంటుపొయ్యాలి... యింకా పొద్దెక్కితే పనెప్పటికి అయ్యేటట్టు."

"అబ్బబ్బ! నన్ను విసిగించకు .. తలంట్లూగిలంట్లూ ఏమీలేవు... మా యింట్లో అసలు పండుగచేసుకునే ఆచారమే లేదు."

"అదేంటమ్మా!" ఆశ్చర్యంతో నోరు తెరిచింది లచ్చి.

"అంతేలే... యింక నన్నుమాట్లాడించకు. వెళ్ళు..." అంటూ తలుపు గడియపెట్టివచ్చి దిండులో తలదూర్చి బాధగా నిట్టూర్చింది శాంత.

* * * *

"అమ్మా !... మరే....మరే... అల్లాలాంబాబులేడూ తెల్లాలకముందే ... తలంతు పోసుకుని... మరే ... కొత్త బత్తలు ఏచుకున్నాలు... మలినాకూ్కల... తలంతిపోచి... కొత్తబత్తలు ఎయ్యవూ?... మరే... యేలవకుండా పోచుకుంతాలేయివ్వాల..." కాఫీ కలుపుతున్న శాంతభుజంపట్టి గుంజుతూ అడిగాడు మూడేళ్ళబాబు వసంత్.

"ఒరేయ్ ... పెద్దగా అరవకు ... నాన్నగారు కోప్పడుతారు." స్నానంచేసి వుతికినబట్టలు వేసుకుంటున్న పెద్దబాబు తమ్ముడికి చెప్పాడు మెల్లగా.

"మా బాబువికదూ ! మొన్ననేగా తలంటిపోసి కొత్త బట్టలు తొడిగాను. ఇవ్వాళ చక్కగా నీళ్ళుపోసి యిస్త్రీ బట్టలు వేస్తాను. ఏం ...హాయిగా వెళ్ళి ఆడుకుంటావుగదూ." శాంత బాబును ఒడిలోకి తీసుకుని బుజ్జగించింది.

"ఆహాఁ.. .నాకు తలంటికావాలి....కొత్త బత్తలు కావాలి. అల్ల బాబు ఏచుకుంటే నేనెందుకేచుకోగూడదు ?" చిన్నబాబు మారాంచేశాడు.

"మా బాబు బంగారుతండ్రి ! చెప్పినమాటవింటాడు. అల్లరిచెయ్యడు....మరేనాన్న నీకు వుప్మాచేసిపెట్టనా ?" శాంత మరిపించడానికి ప్రయత్నించింది.

"ఆఁ....ఆఁ.....నాకుతలంతి కొత్తబత్తలు." అంటూ యేడుపుమొదలెట్టాడు బాబు.

"ఏయ్ ! చిన్నబాబూ! ఏమిటాగోల?" హాల్లో షేవ్ చేసుకుంటున్న రావుగారు ఒక్కకేక వేసేసరికి వురుము విని జడుసుకున్నట్లు తల్లిభుజానికి అంటుకుపోయ్యాడు బాబు. నాడిన్నచూస్తే శాంతగుండె తరుక్కుపోయింది...కళ్ళనిండా నీళ్ళుపెట్టుకుని యేడుపుమూతితో తల్లికళ్ళల్లోకి చూస్తున్న చిన్నబాబును చూడగానే తన చిన్నతనంలో సంఘటన జ్ఞాపకంవచ్చింది శాంతకు...

ఇదే దీపావళిపండుగ... ...పాలేరు వెంకయ్యకొడుకు నర్సిగాడు కొత్తబట్టలులేవని మారాంచేస్తుంటే వెంకయ్య ప్రాణంవిసిగి నాలుగుతన్నాడు. అదిచూచి నాన్న "పండుగలు, సరదాలు, పిల్లలకుగాక కాలంమళ్ళిన నీకూనాకూ

స్త్రటా!... నీకు లేనిబుద్ధి వాడికిరమ్మంటే ఎాగా వస్తుందిరా?" అంటూ వెంకయ్యను కోప్పడి నర్సిగాడికి అన్నయ్యనడిపాత చొక్కాల గూ యిప్పించారు. అవేసుకుని వాడెంత పొంగి పొయ్యాడు! సంతోషంతో దొడ్డంతా గంతులేశాడు. నీళ్ళు నిండిన చిన్నబాబు కళ్ళల్లో నవ్వుతున్న నర్సిగాడిముఖం కనిపించింది శాంతకు. ఆమెమనసు రెక్కలు విరిచికట్టిన పక్షిలా గిలగిల్లాడిపోయింది. చేసేదేమీలేక వాడ్నిగట్టిగా హృదయానికి హత్తుకుని "యేడవకునాన్నా... వెళ్ళిఆడుకో..." అంటూ ముద్దుపెట్టుకుని పంపించేసింది.

అరగంటగడిచీ గడవకముందే వంటమొదలెట్టబోతున్న శాంతదగ్గరకు పక్కింటి రాంబాబు, వసంత్ నవ్వుకుంటూ గంతులేస్తూవచ్చారు... వాడ్నిచూసి పసివెధవకు అప్పుడే ఆ యేడుపంతా యెక్కడికిపోయిందో.' అని నవ్వుకుంది శాంత.

"మలే.. వచంతూ... ఇవ్వాల మా యింటికొత్తావా? మా అమ్మేమో బోలెలు అప్పచీలు చేత్తోంది... మా నాన్నేమో తపాకాయలు తెత్తామన్నాలు ఇద్దలంకలిచి తిపాకాయలు కాల్చుకుందాం..." రాంబాబు గర్వంగా అంటున్నాడు.

"నేనేంలాను... మా అమ్మా అప్పచ్చిలు చేత్తుంది.. మా నాన్నాలూ యిన్ని తపాకాయలు కొంతాలు..." కళ్ళుపెద్దవిచేసి చేతులు బారలుచాచి 'యిన్ని' అంటూన్న బాబు యాక్షనుచూసి 'ఎంత అభిమానమో చిన్నవెధవకు'

అనుకొని నవ్వుకుంటున్నశాంతి, బాబు యిటుతిరిగి 'కదమ్మా!' అనేసరికి సెగతగిలిన తమలపాకులా కమిలిపోయింది ఆమె ముఖం. "ఇంట్లో అల్లరిచెయ్యకుండా వెళ్ళి బయటసైకిలు తిప్పుకోండి." అంటూ పిల్లలకు సైక్లిక్కులుయిచ్చి పంపించేసి హాల్లోకివచ్చింది శాంత... రావుగారు పేపరు చదువుకుంటున్నారు.

"ఏమండీ!" చాలా మృదువుగా పిల్చింది.

పేపరు చదువుతూనే "ఆఁ!..."అన్నారు రావుగారు.

"మరేంలేదు......ఒక్కశేరు గోధుమరవ్వ తెచ్చిపెట్టండి. పిల్లలు కవలడ్డు అడిగారు. చేసిపెడతాను."లాలనగా అడుగుదామన్నా శాంత స్వరం వణికింది. రావుగారు మాత్రం పేపరుచూస్తూనే "మరేంఫర్వాలేదు. ఎల్లుండి చెయ్యొచ్చు..." కటువుగా అన్నారు. మారుమాట్లాడకుండా వంటింట్లోకెళ్ళిపోయింది శాంత ఆలోచిస్తూ.

వంటచేస్తున్నా మనసు మనసులోలేదు. అదేమిటో భర్త తత్వం ఆమెకు అంతుబట్టడంలేదు. ఏడేళ్ళనుండి కాపురం చేస్తున్నా అదేతీరు. కాపురానికి తొలిరోజున పాలుపొంగించి దేముడికి ఆరగింపు చేద్దామంటే "ఊఁ! దేముడూ-దెయ్యం" ఈ పిచ్చినమ్మకాలు నీకూ వున్నయ్యన్నమాట!...ఇదుగో శాంతా ఒక్కటేమాట...ఈ యింట్లో వుండదల్చుకుంటే యిలాంటి మూఢనమ్మకాలు, చాదస్తపు అలవాట్లు మానెయ్యాలి..." అంటూ ఖచ్చితంగా చెప్పేశారు. ఐనా దానికి తను యేమీ బాధపడలేదు. భగవంతుడికి ఒక్కటే నమస్కారం

పెట్టేసింది. ఆయన కనుగుణ్యంగా నడుచుకోడమే తన కర్తవ్యం అనుకుంది. అంతే. ఆనాటినుంచీ పూజాపునస్కారం, పండుగపబ్బం ఏమీ లేదు...తన పుట్టింట్లో పండుగంటే ఎలావుండేది! ... ఐదుమూళ్ళకల్ల గుండిగ వండించేవాడు. నాన్న వచ్చిన వాళ్ళకల్లా లేదనకుండా పెట్టించేవాడు. సంక్రాంతి పెద్దపండుగనాడు వాకిట్లో వడ్లగంప దగ్గర పెట్టుకుని వచ్చినవాళ్ళకల్లా చేటెడు వడ్లుపోసేది తను. నాయనమ్మ తిట్టినా నాన్న అనేవారు "ఎందుకమ్మా కోప్పడుతావు?... కలిగినంతలో యితరులను సంతోషపెట్టి మనం సంతోష పడాలి ..అదే మనజీవితానికి పండగ...." అని.

కానీ ఈయనవాదంవేరు "ప్రపంచంలో పండుగ చేసుకోలేని బీదవాళ్ళెంతమంది లేరు....వాళ్ళందరకూ లేని పండుగ మనకుమాత్రం యెందుకూ?" అన్నాడాయన ఒకమాటు యెప్పుడో..."బాగుంది. ప్రపంచంలో కడుపు నిండా తిండికికూడా నోచుకోని నిర్భాగ్యులు వున్నారు చాలా మంది. మరి అందుకని మనం భోజనం మానామా? మనం ఒక్కరం పండుగలు మానేశాక వాళ్ళకు పండుగ చేసుకోడానికి అవకాశం కలిగిందా?...ఇంకా పండుగనాడు మన చేతనైనంతవరకూ నలుగురు బీదవాళ్ళకు యింత పప్పొ అన్నం పెట్టినా సంతోషిస్తారుగానీ" అందామనుకుంది తను. కానీ, అదేమిటో ఆయనముందు పెదవులు విప్పడమే భయం తనకు. పెద్దపులిని చూచిన లేడిపిల్లలా వుంటుంది తనకు ఆయన్నుచూస్తే. తన మటుకు తను అన్నిసదాలు,

అన్నికోరికిలూ అణిచేసుకుంది....చివరకు యిరుగు-పొరుగు 'ఇదేమి విడ్డూరమమ్మా!' అని బుగ్గలు నొక్కుకున్నా తను బాధపడటం మానేసింది... కానీ, అభం శుభం తెలియని పసిపిల్లలు. వాళ్ళు బాధపడుతుంటే తను సహించలేక పోతోంది....పెద్దవాడు కాస్త తండ్రిని అర్థంచేసుకుంటు న్నాడు. అమ్మను బాధపెట్టకుండా లోపలే మింగుకుంటు న్నాడు. చిన్నవెధవతోటే వచ్చింది తనకు చిక్కు. పసి పిల్లలకు యెన్నో సరదా లుంటాయని, ఎన్నో వుబలాటా లుంటాయని యీాయన కెందుకనిపించదో...వాళ్ళ సరదా లన్నీ మనం తీర్చలేకపోవచ్చు. కానీ, మనకు కలిగినంతలో వాళ్ళ మనసు నొప్పించకుండా చూసుకుంటే యెంత బాగుండు....ఐనా తను బాధపడటంతప్ప యింకేం చెయ్య గలదు. ఇదివరలో పిల్ల లేడుస్తుంటే యేదో సాకున పక్కింటికి పంపించో లేక ముందురోజు మిఠాయి చేసిపెట్టి కనబడకుండా పెట్టో యెట్లాగో తిప్పలుపడేది. ఈమధ్య యీాయన అదీ వీలు పడనివ్వటంలేదు...ఆయన మతం ఆయనది. తను ఆయనకు చెప్పగలపాటిది కాదు పైగా అంత చదువుకున్న ఆయనకు యేమని చెబుతుంది?.... "ఇలాటి మూఢాచారాలు వుంటే మానవజాతికి మనుగడే లేదు...." ఇంకా యేమిటో అంటారు. ఎన్నాళ్ళు తల బద్దలుకొట్టుకున్నా అవి తన కర్థంకావు. తనకు తెలిసిందల్లా ఒక్కటే. తనవల్ల యెవ్వరూ బాధపడకుండా వుంటే చాలు తనకు.

* * * *

"అమ్మగారూ!" పని ముగించుకుని యింటికెళుతున్న లచ్చి పిలిచింది.

"ఏమిటి లచ్చీ?" వంటయింటిలోంచి వస్తూ అడిగింది శాంత.

"తలంటోసుకుని పండుగ సేసుకుంటాను. అన్ని కుంకుళ్లు యియ్యండమ్మా..."

శాంత చప్పున వెళ్ళి దోసెడునిండా కుంకుడుకాయలు తెచ్చి లచ్చి వొడిలో పోసింది. సంతోషంగా వెళుతున్న లచ్చిని "వుండు" అంటూ అర్ధశేరు మినప్పప్పు తెచ్చి కొంగులో పోసి "గారెలు చేసుకో" అంది చిన్నగా.

కృతజ్ఞత నిండిన కళ్ళతో లచ్చి "దరమతల్లి" అంటూ చెయ్యెత్తి నమస్కారం పెట్టి వెళ్ళిపోయింది. అది చూసి శాంతకళ్లు తృప్తితో మెరిశాయి.

* * *

సాయంత్రం యేడు గంటలు కావచ్చింది. చీకటి చిక్క బడుతోంది. రేపు కాల్చాలంటూ పెద్దవాళ్ళు యెంత చెప్పినా పిల్లలువినకుండా ఆనాడే కొన్ని మందుసామానులు కాల్చుకుంటున్నారు. ఎదురింటి వాళ్ళ బాబు అగ్గిపుల్లలు వెలిగిస్తున్నాడు. పంచలోనిలబడి చూస్తున్నారు ఆనంద్, వసంత్ హాల్లో కిటికీదగ్గరగా కుర్చీవేసుకుని కూర్చుంది శాంత ఎదురింటి వాళ్ళబ్బాయి చిచ్చు కాల్చుకుంటాడని అగ్గిపుల్ల వెలిగించి చేతికందిస్తున్నది వాళ్ళక్క. అదిచూచిన శాంతమనసు మళ్ళీ గతంలోకి పరుగుతీసింది.

సరిగా యేడేళ్ళనాటి దీపావళి...అప్పటికి శాంత వయస్సు పద్దెనిమిదేళ్ళు. ఆనాడు యిల్లంతా ఆనందంతో కలకల లాడుతోంది. తమ్ముళ్ళు, చెల్లెళ్ళు ఒక్కటేసందడి. శాంతకుమాత్రం అంత సందడిలోనూ ఏదో వెలితిగావుంది. పల్లెటూరు ఆచారం, అందులోనూ తండ్రికాస్త సనాతన పరుడు గావడంతో శాంతకు పదవయేటనే మేనత్తకొడుకుకిచ్చి పెళ్ళిచేశారు. చిన్నప్పుడు అక్కయ్య "నీకేమే అదృష్టవంతురాలివి. మీ ఆయన చక్కగా పట్నంలో చదువుకుంటున్నాడు. పెద్ద వుద్యోగంచేసి నిన్ను రాణిలా కూర్చోబెడుతాడులే. మాలా పేడా పిడకలూచేసుకో అక్కరలేదు." అంటుండేది. ఆయనచదువు పూర్తిచేసుకుని వచ్చారంటే శాంత ఎంతగానో సంతోషించింది. కానీ ఆ సంతోషం యెక్కువకాలం నిలవలేదు. ఆయన్ని ఎందుకో అందరూ తిట్టిపొయ్యడం మొదలెట్టారు. "ముక్కుపచ్చలారని పసిదాన్ని గొంతుకోశా" మంటూ అమ్మఏడ్చేది. "చదివి ప్రయోజకుడవుతాడను కున్నాంగాని యిట్లా తెలివిమీరతాడనుకున్నామా! ఇంతకూ దానిఖర్మ." అంటూ నిట్టూర్చారు నాన్న. ఇదమిద్ధమని తెలియకపోయినా వాళ్ళలాగంటుంటే శాంత బాధపడుతుండేది. ఎవర్ని అడగగల ధైర్యం ఆమెకు లేదు చివరికి మామయ్య ఆయన్ను 'నా గడప తొక్క వద్దని' వెళ్ళగొట్టారని తెలిసినప్పుడు కృంగిపోయింది. బయటకొస్తే "పాపం శాంతమ్మ అమాయకురాలు...అయినా అతగాడికి అదేం పొయ్యేకాలం" అని

యిరుగుపొరుగువాళ్లు అనుకుంటుంటే శాంతకు ఒళ్ళంతా సూదులు గుచ్చినట్లుండేది. అలాగే రెండేళ్ళుగడిచయి...

ఆ రోజు ఆ దీపావళినాడు శాంత కొత్తబట్టలు కట్టుకొని దేమునిదగ్గర దీపంవెలిగిస్తోంది. ఆయన ఎవరినో పంపిస్తే తల్లీతండ్రీ మాట్లాడుతున్నారు. శాంత కుతూహలం ఆపుకోలేక తలుపుచాటునుండీ సంభాషణ అంతా విన్నది. శాంతకు పూర్తిగా వినపడలేదుగానీ ఆయన ఎక్కడో పట్నంలో వుద్యోగం చేస్తున్నారనీ, అమ్మాయిని తీసుకురమ్మని పంపారని, కానీ అమ్మాయి యిక్కడికి వచ్చాక యికముందు పుట్టింటికి యెలాంటి రాకపోకలుండవని ఖచ్చితంగాచెప్పి వొప్పుకుంటేనే పిల్లను తీసుకురమ్మన్నారని తెలిసింది.

"మాపిల్ల మాకేం బరువుకాదు ఇక్కడేవుంటుంది. దిక్కులేనిదానిలా దాన్ని ఆ కిరాతుడిచేతిలో పడేసి తిరిగి చూడకుండా వుండమంటే దాన్ని యే గొంతుపిసికి బావిలో పడేస్తేమటుకు యెవరుదిక్కు?..." అంటూ అమ్మ యేడుస్తోంది. నాన్ననూ తం ఆలోచించుకుచెప్తామని చెప్పారు ససేమిరాపంపవద్దని అమ్మ యేడుపు. శాంత నిలువునా క్రుంగిపోయింది. తీగనుంచి తుంచిపారేసిన పువ్వులా తలుపుకు చేరబడ్డది. ఆమెలో భయమూ, బాధా రెండూ అల్లుకుపోయినయి...

ఆ సాయంత్రం పూరంతా సందడి. గదిలో కిటికీ దగ్గర నిలబడిచూస్తోంది శాంత. చీకట్లు అలుముకుంటున్నయి. [illegible]

వాటిమీాద ప్రమిదలుపెట్టి దీపాలు వెలిగిస్తున్నారు. దీపాలు వెలిగిస్తూ మురిసిపోతున్న ముగ్ధలు, మతాబాల వెలుగుల్లో బోసినవ్వులు చిలికిస్తూ పొంగిపోతున్న బాలలు, అవ్వాయి చువ్వలని, సీమటపాకాయలని హడావుడిపడ్తున్న కుర్రకారు సందడి. దిగులుమరిచి అమావాస్య అందంచూస్తోంది శాంత. చీకటి చెట్టురంగురంగులపూలు పూచినట్టుంది వూరు వూరంతా. ఎదురింటి రామయ్యగారి కూతురు దీపాలు వెలిగిస్తోంది. అల్లుడు యేదో పరిహాసాలాడు తున్నట్టున్నాడు. యిద్దరూ ముసిముసిగా నవ్వుకుంటున్నారు. శాంత ముఖం చిన్న బోయింది.

"అమ్మా! శాంతమ్మా!... ఈ చీకట్లో కూచున్నావేం? అక్కయ్య బావ యెలానూరాలేదు. నువ్వైనా వచ్చి దీపాలు వెలిగించు. దిబ్బుకొడితే మందులు కాల్చుకోవాలని తమ్ముళ్ళు తొందరపడుతున్నారు. లేచిరా...." నాన్నవచ్చి పిలిచినా శాంతకు బయటకు వెళ్ళాలనిపించలేదు. తనమూలంగా తల్లి మంచం పట్టింది తండ్రి కుమిలిపోతున్నాడు. ఏ ఆనందమూలేని తన కెందుకీ పండుగ అనిపించింది. "ఎందుకులేనాన్నా. నా బ్రతుకే చీకటయింది. ఇంక నే నేం దీపాలు వెలిగిస్తాను?" ఆపుకున్నా ఆగకుండా దుఃఖం పొర్లివచ్చింది.

"బాగుండదమ్మా. చీకటని వూరుకుంటామా?... దీపం వెలిగించుకోమూ. ఇదీ అంతే. జీవితం గోమూ ఆశలనే దీపాలు వెలిగించుకోవాలి. మనిషికి నిరాశపనికిరాదమ్మా.

మన పండుగలకూ పబ్బాలకూ అదే పరమార్థం. పిచ్చి తల్లీ. పిచ్చి ఆలోచనలుమాని లేదిరా..."

శాంత లేచివచ్చి దీపాలు వెలిగించింది. "దిబ్బుదిబ్బు దీపావళీ! మళ్ళీవచ్చే నాగులచవితి!" అంటూ దిబ్బు కొట్టారు పిల్లలు. మందుసామాను కాల్చుకుంటూ చెయ్యి కాల్చుకుంది చిన్నచెల్లి. శాంతవెళ్ళి మరో అగ్గిపుల్ల వెలిగించి చెల్లిచేత కాల్పిస్తోంది పుల్ల వెలిగి వెలుగులు వెదజల్లుతోంది. సంతోషంతో చెల్లి చప్పట్లుకొట్టింది. చివరంటా వెలిగి ఆఖరుసారి భగ్గున వెలిగి గుప్పున ఆరిపోయింది. తన్ను తాను బూడిదచేసుకుంటూ వెలుగునిచ్చిన అగ్గిపుల్ల ఆరిపోయింది!! అటేచూస్తున్న శాంతకు ఏదో తోచి తండ్రి దగ్గరకు పరుగెత్తింది.

"నాన్నా! నేను ఆయన దగ్గరకు వెళతాను నాన్నా, నన్ను పంపించండి" అంది.

"అలాగేనమ్మా...." అన్నాడు నాన్న.

"శాంతా!" ఆలోచనల్లోంచి తృళ్ళిపడ్డది శాంత.

"వాళ్ళను లోపలికి పిలు" అన్నారు రావుగారు.

"బాబూ! నాన్నగారు పిలుస్తున్నారు. లోపలకు రండి" అంటూ పిల్లల్ని పిలిచింది. ఎదురింటి అబ్బాయిలకు, చిచ్చుబుడ్డి వెలిగించడంలో సాయపడుతున్న పెద్దబాబు వెలిగే మతాబును వినోదంగా చూస్తున్న చిన్నబాబూ ముఖాలు యింతింత చేసుకొని లోపలికి వచ్చారు.

"నాన్నాలూ! మాకూ తపాకాయలు తేలా?..." వసంత్ ముద్దుగా అడిగాడు. "టపాకాల్లేవు గిపాకాయల్లేవు .. అసలు వాళ్ళిళ్ళకు వెళ్ళొద్దని మీా కెన్నిసూాట్లు చెప్పానూ?" రావుగారు గుడ్లెర్రజేసేసరికి బిక్కమొగంతో పిల్లలిద్దరూ లోపలికి వెళ్ళారు.

* * * *

మరునాడు వుదయం తొమ్మిదిగంటలు కావచ్చింది. శాంత యింటిలో యేదో పని చేసుకుంటోంది. పెద్దబాబు స్నేహితులతో ఆటలకు వెళ్ళిపోయాడు. "ఇప్పుడే బజారు వెళ్లొస్తా" నంటూ రావుగారు సైకిలు తీసుకు బైలుదేరారు. ప్రహరీదాటియివతలికి వచ్చేసరికి ఆ కంటబడినదృశ్యం చూసి ఆయన కోపంతో వణికిపోయ్యారు. కళ్ళు నిప్పులుకురుస్తు న్నాయ్........

ఎదురింటివాళ్ళ పెంటకుప్పమీాద పనిమనిషికొడుకు రంగడు, చిన్నబాబు దేనికోసమో పెనుగులాడుకుంటున్నారు. ఇద్దరూ అటువైపు తిరిగున్నారు. ఇద్దరూ వంగ మళ్ళీ వేటినో యేరుకుంటున్నారు మణులూ మాణిక్యాలకంటె యెక్కువ పదిలంగా. రావుగారు గబగబా అటువైపునడిచారు.

"బాబూ!...ఇవి నాకూ..."

"ఊహుం...నీకు మీా అమ్మ కొనిపెడ్తుందిగా. ఇవన్నీ నాకే...." బలవంతంగా రంగడిచేతులోంచి గుంజుకుంటు న్నాడు చినబాబు.

"బాబూ !...."

సింహం గర్జించినట్లు ఉరుము ఉరిమినట్లు ఉలిక్కి-పడ్డాడు బాబు. రావుగార్ని చూడగానే. రంగడు ఒక్క-అంగలో పారిపోయ్యాడు. బాబు భయంతో దొంగలా వొణుకుతూ నిలబడ్డాడు. చిన్నారికళ్ళు అ ప్రయత్నంగా అశ్రు పూరితాలయినయి. రావుగారు ఒళ్లుతెలియని కోపంతో సైకిల్ వదిలేసి పెద్దపెద్ద అడుగులేసుకుంటూ పెంటకుప్ప మీదికి వెళ్ళారు.

పైకి వస్తున్న పులినిచూచి సగం స్పృహతప్పిన మేక పిల్ల స్థితిలావుంది బాబు పరిస్థితి. గుడ్ల నీరుకారుతుంటే వణు కుతూ అక్కడే నిలబడ్డాడు.

"ఏమిటవి ? ?..."

బాబు చేతులు పట్టువదిలినయి. దాచుకున్న పెన్నిధి నేలపాలయినయి, ఆరిపోయిన అగ్గిపుల్లలు ! ! కొట్టడానికి యెత్తిన రావుగారి చెయ్యి అలాగే వుండిపోయింది !

కోపమూ. బాధా, దుఃఖం అన్నీకలిసి రావుగారి ముఖం వివర్ణమయింది. ఆ స్థితిలో రావుగార్ని యే చేయి తిరిగిన చిత్రకారుడూ చిత్రించలేడు ! ఏ రచయితా వర్ణించ లేడు ! ఏ శిల్పి చూపలేని హావభావాలవి ! ! !..

రెండు నిముషాలు గడిచయి.

మాటలురాని మూగబొమ్మ బాబు ! చేష్టలుడిగిన శిలాసదృశ్యం రావుగారు.

"బాబూ!.... ఇట్రా!...." గొంతు పెగల్చుకుని పిల్చారాయన.

బాబు అడుగులో అడుగేసుకుంటూ వచ్చి ప్రక్కన నిలబడ్డాడు.

"సైకిలెక్కు...." అన్నారాయన.

*　　　*　　　*　　　*

ఇంట్లో శాంత చిన్నబాబు కన్పడలేదని కంగారుపడు తోంది. అందరిళ్ళల్లోనూ వెతికొచ్చింది. బస్సులు, కార్లు, లారీలు వస్తుంటయి పిల్లవాడు యేమయినాడో యేమోనని ఆమె గుండెల్లో గుండెలులేవు. ఏం చెయ్యడానికీ పాలుపోక కుప్పకూలి కూర్చుంది.

వాకిట్లో రిక్షా చప్పుడయితే ఆత్రుతతో లేచిచూసింది. చిన్నబాబు రిక్షాలోంచి దిగుతున్నాడు. ఆ వెనకనే సైకిలుతో లోపలికివచ్చారు రావుగారు. వాళ్ళవెంట రిక్షావాడు ఒక పెద్ద తాటాకులబుట్ట తెచ్చి లోపలపెట్టి డబ్బులు తీసికెళ్ళి పొయ్యాడు. శాంతకు యేమీ అర్థంకాలేదు. ఆశ్చర్యంగా చూస్తూ నిలబడింది.

రావుగారు ముసిముసిగా నవ్వుతూ "శాంతా! అవేమిటో చెప్పుకోచూద్దాం...." అన్నారు.

"ఏమిటమ్మా అవి?" అప్పుడేవచ్చిన పెద్దబాబు ఆత్రుతగా చూస్తూ అడిగాడు.

"తపాకాయలు! తపాకాయలు!!..." చిన్నబాబు సంతోషంతో చప్పట్లుకొడుతూ అన్నాడు

"టపాకాయలా!!!..." శాంత, ఆనంద్ యిద్దరి నోటంటా ఒక్కమాటే వచ్చింది

"అమ్మా!...మలే...మలే నాన్నాలు మిఠాయి తెచ్చారు! నీకు పూలుకూలా తెచ్చాలమ్మా!" బాబు గంతులేస్తూ చెప్పాడు.

నమ్మశక్యం కాక నిజమా అన్నట్లు చూస్తున్న శాంతతో "నిజంశాంతా! మనం యికనుండీ ప్రతిపండుగా చేసుకుందాం...ముందు ఈ బట్టలు పిల్లలకు తొడుగు." రెడీ మేడ్ డ్రెస్సెస్ పాకెట్ యిస్తూ చెప్పారాయన...పిల్లల కివేమీ పట్టలేదు. 'మా నాన్నగారు టపాకాయలు తెచ్చారు' అంటూ ఇరుగుపొరుగు పిల్లలతో చెప్పుకోడానికి పరుగెత్తారు.

మరో పాకెట్ తీసి భార్యచేతికిస్తూ "ఇదిగో యిది నీకు ప్రెజెంట్" అన్నారు.

"ఏమిటిది? క్రొత్తచీరా!" సంతోషంతో వెలిగి పోతున్న ముఖంతో అందుకున్న శాంత సన్నని ఎలుగుతో "మరి నన్ను దీపాలుకూడ పెట్టుకోమంటారా?" అని అడి గింది మృదువుగా.

"తప్పకుండా! ఒక్కటికాదు...యింటినిండా వెలి గించాలి! కానీముందు నాకు నా ప్రెజెంటుయిస్తేనే..."

నవ్వుతూ కొంటెగా చూస్తూ దగ్గరగా లాక్కున్నారు రావు గారు. ఆయనకా కొంటెనవ్వే వెలుగయింది.

శాంతముఖంలో ఆ అనురాగజ్యోతే వెయ్యిదీపాలు వెలిగించింది !!!

(జాగృతి నుండి పునర్ముద్రితము.)



# "హారి పిడుగుల్లారా!!..."

గోచీపోసి కట్టినచీర, చంకలో గంప, ఒకచేతిలో సోది బుర్ర, కుడిపైట, ముక్కుకి బులాకీ, మొహాన అర్ధరూపాయంత కుంకుమ బొట్టుతో ఎరుకలసాని వేషంతో శశి స్టేజి మీద అడుగుపెట్టగానే మా వుమెన్స్ కాలేజి డ్రామా హాలులో హర్షధ్వానాలు మిన్నుముట్టినయి. అవి మా కాలేజి వార్షికోత్సవాలు. 'పద్మావతీ పరిణయం' నాటకంలో గౌరీదేవి ఎరుకలసాని వేషంలో ధారుణీదేవికి, పద్మావతికి ఎరుకచెప్పే సీను అది.

నాటకం వ్రాసి లెక్చరరు గారికిచ్చేటప్పుడే ఎరుకలసానిపాత్రకు శశిపేరు సూచించాను. ఆమె వొప్పుకున్నారు. శశి చామన చాయరంగు. తీరైన కనుముక్కు, అమరినట్లుండే విగ్రహం, ఆ కళ్ళల్లోని కళ, ఆ పాత్రకు శశిచక్కగా అమరుతుందనుకొనే ఆమెను దృష్టిలో పెట్టుకునే ఆ పాత్ర పలికిన ప్రతిమాటా వ్రాశాను.

ఇదే తొలి అనుభవమైనా తొణుకూ బెణుకూ లేకుండా శశి స్టేజిమీద అడుగుపెట్టింది. పాత్రలో లీనమయి అద్భుతంగా నటిస్తుంటే అల్లరిపిల్ల శశేనా యిది అనిపించింది కానీ—తను దైవప్రార్థన మొదలుపెట్టగానే మాత్రం నా గుండెల్లో ఆటంబాంబు పేల్చినంత పనిఅవడం మాత్రం నిజం! ఎందుకంటే 'పనిబడి ప్రత్యేకంగా నా పాత్రకు

నన్నెంచుకున్నందుకు నలుగుర్లో నీ పరువు తియ్యడానికి' వ్రాసియిచ్చిన తల్లే కమలమ్మతల్లే... ప్రోత్సహించగందకంలేను. నేనేమిసేశ్తో... 'అంటూనుచూడు' అని బెదిరిస్తుండేది రిహార్స ల్సులో. అన్నా అనేరకమే! నమరూ బెదురూ లేనిఘటం! కాని దాని పుణ్యమూ అని అలాంటిదేమీ చెయ్యలేను.

ఆ నాటకంలో అత్యంత ముఖ్యమైన ఘట్టమది... తల్లిదండ్రులెవరో తెలియదు. ఆస్తిపాస్తులా అసలే లేవు. దారినపొయ్యే దానయ్య యెంతటి నవమన్మథా కాకపోతే మాత్రం కూతురినివ్వడానికి తల్లిమనసొప్పుతుందా?... సంశ యాకులచిత్త ధారుణీదేవి, ప్రియావిరహ పరితప్త పద్మావతి. ఇద్దరినీ ఏకకాలంలో మెప్పించాలి. డ్రామా విజయమంతా ఆ పాత్రమీదనే ఆధారపడివుంది. ధారుణీదేవియెడల అణ కువ, వినయమూ, పద్మావతియందు స్నేహాభిమానాలు కన బరుస్తూ పాత్రకుప్రాణం పోసింది శశి. ధారుణీదేవి సంశయాలు తొలగించి పద్మావతికి వూరట కలిగిస్తుంది. శ్రీనివాసుని ఓ యింటివాడ్ని చెయ్యాలన్న ముక్కోటిదేవతల సత్సం కల్పానికి యీ విధంగా కార్యరూపమిచ్చిన ఎరుకలసానిగా శశి చూపిన హావభావాలు, నటనాచాతురి అటుపెద్దల ఆశీస్సు లను, యిటు ప్రేక్షకుల మన్ననలూ చూరగొన్నాయి.

శశి ప్రథమబహుమతిని అందుకుంటున్నప్పుడు కరతాళ ధ్వనులతో, హాలు మారు మ్రోగింది. 'మృదుమధురమైన శైలిలో పేరొందిన పౌరాణికగాథను హృదయరంజకంగా నాటకరూపంలో అందించిన కుమారి కమలకు' అనగానే

నా కాళ్ళూ చేతులూ వణికినయి. నాకు చచ్చేటంత సభా పిరికితనం!....బహుమతి నందుకుని నాటకం విజయవంతం కావడానికి తోడ్పడిన పాత్రధారులకు, ముఖ్యంగా రసవత్తర మైన ఘట్టంలో రక్తికట్టించేవిధంగా నటించిన శశికళకు, కంపితస్వరంతో మెలాగో కృతజ్ఞతలు తెల్పుకుని బయట పడ్డాను. నిజంగా శశి నటన చూచితీరవలసిందే...ఇవ్వాళ అరుణ వచ్చుంటే యెంత బాగుండేది!...ఎందుకురాలేదో తను అనుకున్నాను...

*　　*　　*　　*

సాయంత్రంవేళ. అమ్మకు కూర తరిగిపెడ్తున్నాను. అమ్మకు నా పని నచ్చనే నచ్చదు. "అదేం తరగడమే?... రామ! రామ!" అని అమ్మ విసుక్కుంటోంది. అసలావిడకు ఆడపిల్లల చదువులంటేనే గిట్టదు. స్కూలుఫైనలుకాగానే నన్నో యేడు చదువుకూడ మాన్పించేసింది. కానీ—నా పోరు పడలేక (మనలోమాటగా చెప్పుకోవాలంటే—తనకునచ్చి, నన్ను మెచ్చిన సంబంధం యొక్క డాదొరక్క) మళ్ళీ కాలేజీలో చేర్పించింది. ఏమాట యేం నోరుజారితే యెక్కడ కోపంవచ్చి "రేపటినుండి నీకు కాలేజిలేదు గడ్డలూలేదు!" అంటుందోనని నా గుండెలు పీచుపీచుమంటుంటయి... అందు కనే ఆవిడ యే వేళప్పుడు యేంపని చెప్పినా యెంతటి అతి ముఖ్యమైన నోట్సుగ్రాసుకుంటున్నా కిక్కురుమన కుండా వచ్చి ఆపనేదో అవకతవకచేసి అమ్మపెట్టేవి నాలుగూ తిని (తిట్లు లెండి) వెళ్తుంటాను...

"కమలా!...కమలా!......" పిలుస్తూనే లోపలికి వచ్చింది శశి.

"ఆ!...ఒకముక్క పెద్దది, ఒకముక్క చిన్నదీ యీ తరిగింది చాలుగానీ, ఆ అమ్మాయొచ్చింది వెళ్ళు......" అంటూ కత్తిపీట లాక్కుంది అమ్మ. 'బ్రతికాం' అనుకుంటూ పాకశాలనుంచీ బయలుపడ్డాను.

"అరుణ హిస్టరీనోట్సు యిస్తానంది. వెళ్ళొద్దాం రావే...'' అంది శశి.

"నేనూ వెళ్ళాలనుకుంటున్నాను అరుణావాళ్ళింటికి... నిన్నకూడా తనెందుకనో కాలేజికి రాలేదు. వెళ్ళొద్దాం పద" అంటూ, ఇప్పుడే వస్తానని అమ్మతో చెప్పి బయలు దేరాం.

శశికళ పెద్ద 'బిజినెస్‌మాన్'కూతురైనా గర్వం గిర్వం మచ్చుకైనా లేనిపిల్ల. అందరితోనూ కలుపుగోలుగా వుంటుంది. మేమిద్దరం అరుణా వాళ్ళయింటికి వెళ్ళేసరికి తను వాళ్ళయింటిముందు తోటలోకూచుని చదువుకుంటోంది. వాళ్ళ నాన్నగారు ఆ వూర్లో పేరుపొందిన డాక్టరు. తను మేము రావడం గమనించలేదు...శశినాకు సైగచేసి మెల్లిగా అడుగులో అడుగేసుకుంటూ వెళ్ళి కళ్ళుమూసేసింది. అరుణ వులిక్కిపడి చేతులు తడుముతూ, "అబ్బ! కమలా! వదలవే నీకు పుణ్యముంటుంది." అన్నది.

శశి చేతులు తీసేసి నన్ను మర్చిపోయినందుకు బహుమతి.' అంటూ చిన్నమొట్టికాయవేసి పక్కనే కూచుంది సిమెంటు అరుగుమీాద నేనూ పక్కనే కూచున్నాను.

"అరుణాదేవిగారూ! ఒక్కక్షణం ఈ పుస్తకం మూసెయ్యండి! కావాలంటే రిజిష్ట్రారుగారికి 'యూనివర్సిటీ ఫస్టు మాకెవ్వరికీవద్దు. మా అరుణకివ్వవలసిందని' రికమెండ్ చేస్తాంలే. అంటూ అరుణచేతిలో పుస్తకం లాగేసింది శశి.

"అరూ! ఇంతచక్కటి సాయంత్రం! ప్రకృతి పుస్తకంలోని ఈ అందమైన పటం చూడకుండా ఆ పుస్తకం ఏమిటే!... ఈ సంధ్యారాగంలో బంగారు కోనేటినీటిలో స్నానం చేస్తున్నట్లు మిలమిలా మెరిసిపోతున్న యీ తోటలో చెట్లు!..."

"ఫోర్టిన్ కారెట్స్ కోనేరా! లేక ట్వెంటీ టు కారెట్స్?..." శశిసందేహం.

"పుస్తకం తెరిచానేగానీ—నా మనసిక్కడలేదే." మా మాటలు విన్పించుకోనట్టే అంది అరుణ—తనముఖం ఎందుకోగాని ముకుళించిన కమలంలా వుంది.

"కొంపదీసి అటు 'లడక్' వైపుగానీ వెళ్ళిందేమిటే?" నేను నవ్వుతూ అడిగాను. వాళ్ళబావ రాజుకు మిలటరీలో వుద్యోగం. ప్రస్తుతం లడక్‌లో వుంటున్నాడు.

"ఛా! అదేంకాదు......" కాస్సేపాగి మళ్ళీఅంది "లక్ష్మికి పెళ్ళిట..." అని చాలా మెల్లిగా.

"సరిపోయింది! కొండనుతవ్వి ఎలుకను పట్టినట్టు ఇదంకా 'పుట్టి' మునిగినట్టు మొహంపెట్టుకూర్చున్నావ్!

"తనకంటె ముందు అయిపోతోందని దిగులు కాబోలు!..." శశి వ్యాఖ్య.

"ఎవరికిచ్చి అనుకుంటున్నావ్ ?..." అరుణ చాలా సౌమ్యంగా అడిగేసరికి కథ అడ్డంతిరగలేదుకదా అనే అనుమానం వేసిందినాకు. లేకుంటే యింతేసి మాటలన్నందుకు మా యిద్దరిచేత అధమం చెరి పదిగుంజిళ్ళుఅయినా తీయించి వుండేది అనుకుంటూ, "మీ బాబాయికొడుకు గోపీకిస్తారని అంటుండేదానివిగా..." అన్నాను.

"కాదు... ...వాళ్ళ మేనత్తకొడుకు సుందరానికిచ్చిట..." అంటూ బరువుగా నిట్టూర్చింది.

"ఆఁ!!!..." అన్నాను. ఒక్కమాటు గుండెలమీద పెద్ద బరువుపెట్టినట్లయింది. లక్ష్మి హైస్కూల్లో నా క్లాస్‌మెట్, అరుణకు మేనత్తకూతురు. అరుణ, లక్ష్మి, నేనూ ఒక్కప్రాణంగా వుండేవాళ్ళం. లక్ష్మి చిన్నప్పుడే తల్లిదండ్రులిన్ని పోగొట్టుకున్న అభాగిని. వాళ్ళబామ్మ పెంచి పెద్దచేసింది. వాళ్ళ బావ సుందరంనుకూడ నేను చూశాను. చిన్నప్పుడే తండ్రి పోయినందున ఒక్కడే సంతానంకావడంచేత వాళ్ళమ్మ బాగా గారాబంచేసింది. చదువూ సంధ్యా వంటబట్టలేదు. వాళ్ళమ్మ మహాగయ్యాళి. ఆ తల్లీ కొడుకుల్నిచూస్తే నాకు చిలకమర్తివారి 'సింగమ్మ', 'గణపతి' జ్ఞాపకంవస్తారు. అదీకాక, లక్ష్మి వాళ్ళ మేనమామకొడుకు గోపీమీద మనసు నిల్పుకుంది. వాళ్ళ ప్రేమను గురించి వాళ్ళ బామ్మగారి చెవిదాకా పోకపోయినా మా మిత్ర బృందమంతా యెరుగుదుము.

"అయితే లక్ష్మి యేమంటోంది?..." అని అడిగాను. నాకు తెలియకుండానే దీర్ఘనిశ్వాసం వచ్చేసింది.

"అదేమంటుంది? 'మా బామ్మ నా శవానికి కట్టిస్తుందిలే తాళిబొట్టు...' అంటోంది..."

హరి! హరి! అది సహజంగా నోరుజారే యీసడింపు కాదు. నిండుకుండ...అది అన్నది అంటే చేసితీరుతుంది... నా కెందుకో భయంవేసింది. ఏమీతోచక చివరికి "పోనీ... ఈ విషయమంతా వాళ్ళ బామ్మకుచెప్పి గోపీకిచ్చి పెళ్ళి చేస్తే మంచిదని నచ్చచెబితేసరి. తల్లీ తండ్రీ తనేఅయి పెంచిందికదా ...లక్ష్మి మనసుకు కష్టం కలిగిస్తుందా?..." అన్నాను.

అరూ తల అడ్డంగా త్రిప్పుతూ "లాభంలేదు" ఆవిడ గుణం యెరగందిగనుకనా. ఆవిడపట్టు ఆవిడిదేగాని, యితరుల మాట వినిపించుకోదు" అంది.

"నీకు తెలీదుఅరూ! అలా నోటిదురుసుతనం వున్న వాళ్ళమనసు వెన్నపూసంటారు. ఆవిడకు లక్ష్మింటే పంచ ప్రాణాలు.. చెప్పేతీరులో నచ్చచెబితే దాని యిష్టాన్ని ఆవిడ ఎప్పుడూ కాదనదు...." నా వూహను సమర్ధించు కున్నాను.

"ఇదుగో కమలా! నోటిదురుసు వాళ్ళమనసు వెన్నపూసో, జున్నుగడ్డో నాకు తెలియదుగానీ ఏండ్లతరబడి కుటుంబంతో బాంధవ్యంగల మాలక్ష్మి బామ్మగారి మనసు

మాత్రం నాకు తెలుసు. ఆవిడ అనుకున్నది జరిగితీరాలి. అంతే... అసలావిడకు తప్పించి యితరులకు మనసులూ మమతలూ, అభిమానాలూ, అభిప్రాయాలూ వుంటాయంటేనే ఆవిడ వొప్పుకోదు... ఇక మనంగనుక వెళ్ళి చెప్పామంటే యీ కుర్రకుంకలు నాకు చెప్పేపాటి వాళ్ళాలని 'నేను చెప్పిన వాడిన్ని ఎట్లా చేసుకోకపోతుందో చూస్తానంటూ' దాన్ని ఏ స్తంభానికో కట్టేసినా కట్టేస్తుంది. లేనిపోని అగచాట్లు దానికి కల్పించడం అవుతుంది." అంటూ అరుణ పెదవి విరిచింది.

"అయితే, పెద్దచిక్కే వచ్చిందే?" నేను ఆలోచనలో పడిపోయ్యాను.

"ముందు అన్నయ్యముఖం చూడలేక పోతున్నానే... నోరిప్పి ఏమీ అనకపోయినా వాడిదంతా స్వయంపాకం. పిచ్చిరూపుగా తయారయాడనుకో .." అరుణకళ్ళు వర్షిస్తున్నాయి. రుద్ధమైన కంఠంతో అదిఅలా చెబుతుంటే నా కళ్లూ చెమర్చినయి. కళ్ళొత్తుకుంటున్న మమ్మల్నిచూసి శశి నవ్వింది.

"మేమంతా బాధపడ్తుంటే నీకు నవ్వులాటగావుందా శశీ?" అరుణబాధగా అంది.

"ఏడిస్తే బాధలు పోయ్యేటట్లయితే అరుణా! నేనూ ఎడా తెరిపీలేకుండా ఏడ్చిపెట్టగలను..." అది మళ్ళీ నవ్వుతూనే అంది.

"ఆడదాన్ని అంతకంటే ఏం చెయ్యగలను చెప్పు, సానుభూతి చూపడం తప్ప?" అరూ నిస్సహాయంగా చూస్తూ అంది.

"అయితేయింకేం నువ్వూ కమలా యిక్కడ చేరి యిలా సానుభూతి వర్షిస్తుండండి, అక్కడ బామ్మగారు మీ నిట్టూర్పుల దుమారం, మీ కన్నీళ్ళవర్షం తట్టుకోలేక మీరు కోరినట్లు చేసేస్తుంది!" శశి యింకా దాని సహజ మైన వ్యంగ్యధోరణిలోనే మాట్లాడుతోంది.

"అబ్బబ్బ! అలా మాటలతో చంపక ఏం చెయ్య మంటావో చెప్పిపడవరాదూ!" అరూకి యీ మాటు నిజంగా కోపమే వచ్చింది.

"అదిగాదే అరూ! కష్టం వచ్చినప్పుడు తప్పించుకునే వుపాయం చూచుకోవాలి గానీ మాటల్లో సానుభూతి వొలక బోసి ఏం ప్రయోజనమే? ఇక ఏం చెయ్యడమంటావ్, అది మన 'బ్రెయిన్ ఆఫ్ అయిడియాస్' ను అడుగు." అంటూ సలహాయిచ్చింది.

'బ్రెయిన్ ఆఫ్ అయిడియాస్,' 'వూహాగాయని,' 'పిచ్చిపిల్ల' లాంటి యెన్నో పేర్లునాకు కాలేజీలో. మా ఫ్రెండ్స్ కమలా సహస్రనామావళి అంటుంటారు. శశి అలా అనంగానే నాకూ నిజమేననిపించింది.

"అవునే అరూ! ఎ డి యిరవై యెన్త శతాబ్దంలో బి. సి. లో బాగా ఆడవాళ్ళు కన్నీళ్ళు కార్చటంతప్ప ఏమీ చెయ్యలేమనుకోవడం! యువతీ లోకానికే ఇన్సల్ట్! సాను

భూతేకాదు సహాయంకూడ చెయ్యాల్సిందే మనం! ప్రతి క్లాసులో వారానికోకథ చదవటంలా ప్రేమాయణంలో ఫ్రెండ్స్ సలహాలు, సహాయాలు గురించి! అన్ని రంగాల్లోనూ పురుషులతోబాటుముందడుగు వేసిన మహిళాలోకం యిందులో వెనకబడ్డమా?... అరూ! నీకెందుకే నువు దిగులుపడకు. ఇంత మంది ఫ్రెండ్సున్నాం. మనం అందరంకలిసి ఎలాగో లక్ష్మికి గోపీకి పెళ్ళి జరిపించాల్సిందేనే." అన్నాను ఆవేశంగా.

అరుణకళ్ళల్లో విద్యుత్తు వెలిగింది. ఆశగా నా కళ్ళల్లోకి చూస్తూ "నువ్వే ఏదైనా వుపాయం ఆలోచించవే... నువు చెప్పింది తు. చ తప్పకుండా అనుసరిస్తాంమేము" అంది.

ఆవేశంలో ఏదో అనడమైతే అన్నానుగానీ ఐడియా మాత్రం ఓ పట్టానరాలేదు. చివరికి "పోనీ అతగాడు, ఆ సుందరానికి యీ విషయమంతా చెబుతూ ఓ ఆకాశ రామన్న లేఖ వ్రాస్తే?" అని అడిగాను.

"సరిపోయిందే! రామాయణమంతా విని రాముడికి సీతేం కావాలన్నారుట వెనుకటికి! అతడికి ఆ మాత్రం ఆలోచనా, స్వతంత్రం వుంటే యింకేం? అతడా వుత్తరాన్ని వాళ్ళమ్మకు చూపడం, ఆవిడకాస్తా ఆగ్నేయాస్త్రంవదిలితే. యిక్కడ అది చూసి బామ్మగారు అగ్గిఅయితే, యిక అందులో మనలక్ష్మి బుగ్గిఅవడం... అదే జరిగేది" అరూ ముఖంలో మళ్ళీ నిరాశ ప్రతిఫలించింది.

ఈ మాటు మళ్ళీ యింకో ఆలోచనవచ్చింది నాకు "పోనీ...యీ సంగతంతా బామ్మగారికే వివరంగా వ్రాసి యీ సంబంధంమటుకు చెయ్యకపోతే 'బ్లాక్ మెయిల్' చేస్తా మని బెదిరిస్తే?...."

"ఈ ఫుడుతూపులకు బెదిరేఘటం కాదోయ్ ఆవిడ! 'బామ్మగారి శీలమును వర్ణింపుము?'—అంటే, ఆమె అభిమానించినవారిని స్వర్గమునకు యెత్తివేయును వారు ఎప్పుడైనా తనమాటకు కించిత్తు యెదురాడినా వెంటనే అధఃపాతాళానికి త్రొక్కివేయును. మాటపట్టింపులకు, పట్టుదలలకు ఆవిడ కాణాచి. వాటికితప్ప ప్రేమాభిమానాలకు ఆవిడ దృష్టిలో విలువేలేదు. ఉదా: చెప్పాలంటే, మా అత్తయ్య పెళ్ళిలో మా వాళ్ళకూ వాళ్ళకూ మాటామాటా వచ్చిందిట. కోడల్ని పుట్టింటిగడప త్రొక్కనివ్వలేదు సరిగదా చివరికి మా అత్తయ్య చనిపోయినప్పుడు మావాళ్ళు పసుపుకుంకుమ పట్టుకెళ్ళినా, పుట్టెడు దుఃఖంలోవున్న మా బామ్మను కూడ పలుకరించినపాపాన పోలేదుట!...ఈ మధ్య కాస్త లక్ష్మి పెద్దదయ్యాక యీ మాత్రం రాకలుపోకలు...ఇక మూఢనమ్మకాలు, ఆచారాలు అంటావా కోకొల్లలు... లక్ష్మిని నిండునెలలు కడుపుతోవున్నప్పుడు వాళ్ళ నాన్న పెద్ద త్రాచును చంపాడట! అదెక్కడ పాపంచుట్టుకుంటుందో నని పెద్దశాంతి చేయించి మనుమరాలికి నాగలక్ష్మి అని నామకరణంచేసేదాకా నిద్రపోతే వొట్టని మావాళ్ళు చెప్పుకుని నవ్వుకుంటుంటారు..." అరుణ అదేధోరణిలో చెప్పుకు పోతోంది.

వింటున్న నాకు సడన్‌గా మెరుపులా తట్టింది ఓ ప్లాను! ఒక్క గంతులో లేచివెళ్ళి తన చెవిలో చెప్పాను రహస్యంగా. అరుణ ఎగిరిగంతేసింది. వెంటనే శశి భుజం పట్టుకుని "నువ్వు మాకో సాయం చెయ్యాలే..." అంది.

"పరోపకారార్థ మిదం శరీరం!" త్యాగధనునిలా 'పోజు' పెట్టి కూచుంది శశి. అరుణ చెవిలో అసలుసంగతి చెప్పేసరికల్లా "హారామ్! మూర్ఛ! మంచినీళ్ళు కనీసం సోడా!" అంటూ వెనక్కు వాలిపోయింది శశి మూర్ఛ వచ్చినదానిలా.

"అయితే యిందాక అన్నవన్నీ వుత్తరకుమార ప్రజ్ఞలే!..." అన్నాను దాన్ని లేవదీసి సరిగా కూచో బెడుతూ.

"ఇదుగో! మీ కంతగా నన్ను చంపియ్యాల్నుంటే యీ బి. ఏ అయిపోయాక చంపండి. అప్పుడు ఫలానా సాహసకృత్యంలో శశి బి. ఎ గారు మరణించారని వార్తలలో వేయించవచ్చు. అంతేగాని—పక్కన డిగ్రీలేకుండా నేను చావనమ్మా!..." శశి మూతి బిగించుకుంది.

"పోన్లేవే...'కుమారి శశికళ సెకండ్ బి. ఎ గారు మరణించారని తెలుపుటకు చాలా విచారిస్తున్నాం' అంటూ ఓ సంతాపగీతంతోసహా 'రేడియో సిలన్'లో చెప్పిస్తాంలే" భుజంమీద తట్టుతూ నవ్వాను.

"నువ్వు నూరుచెప్పు! లక్షచెప్పు! నాకు బొమ్మగారంటే డిటెక్టివ్ నవలలంత భయం!..."

"వాటికీ, ఆవిడకూ యేంపోలికే!..."

"డిటెక్టివ్ నవలలు చదివితే రాత్రి కల్లోకి శవాలూ, రక్తపుమడుగులూ వచ్చినట్టు బామ్మగార్నిచూస్తే పెద్ద పులులు, సింహాలు కల్లోకివస్తయి. అవిడా, లక్ష్మి కలిసి యెక్కడికో వెళ్తుంటే ఓమాటు చూశాన్లే..."

"వెనుకటికి, మహారాణిని ఆపదనుండి కాపాడడానికి తిమ్మనకవి పెద్ద ప్రబంధం రాశాట్ట కష్టపడి! ఆపదలో అడ్డు పడగల్గినప్పుడే కళకు సార్థకత! నువ్విలా భయపడ్తున్నావంటే అది నీలోని కళకే అవమానం! కళాసరస్వతికే తీరని తల వంపులు!" ఆవేశంతో చిన్న ప్రసన్యాసం దంచేసేసరికి "సరే కానివ్వు!" అన్నది పెద్దపోజులో శశి.

"ఇది చాలా రహస్యంగా మనలో మనం అన్ని యేర్పాట్లూ చేసుకోవాల్సిన విషయం. బయటికి పొక్క కూడదసుమా! గోడలకు చెవులుంటయి..." అని నే నన్న దానికి శశి "గోడలకు చెవులమాట దేముడెరుగుకానీ — నీ బీరువాలో కాగితాలకుమాత్రం కళ్ళుంటయి. కథల్లోకి మాత్రం యెక్కించకుతల్లీ!...నవ్వుతూ అన్నది.

"అన్నట్టు మీ అన్నయ్య యేదో 'ఎమెచ్యూర్ డ్రమెటిక్ ఎసోసియేషన్' సెక్రటరీ అన్నట్టున్నావు యెప్పుడో?..." ఆలోచిస్తూ నే నడిగినదానికి నా ముఖంలోకి చూస్తూ "అవునని" కళ్ళతోనే చెప్పింది శశి.

*          *          *

"మూడు కావస్తున్నదే" అనుకుంటూ గబగబా బయల్దేరబోతున్నాను. ఇంతలో "ఎక్కడికే?..." దొడ్లోంచి అమ్మ కేక విని 'భగవాన్! ఆదిలోనే హంసపాదా!...' అనుకుంటూ అరుణా వాళ్ళింటికి అనబోయి "లక్ష్మివాళ్ళింటికి" అనేశాను చటుక్కున. వెధవది అబద్ధంకూడ అవసరానికి హితంవేస్తుంది!

"ఇంత ఎండలో అంతదూరం ఎందుకే?......" అంటున్న అమ్మకి లక్ష్మి యెందుకోరమ్మని కబురుచేసిందమ్మా. ఎండవుండగా వెళ్తే చీకటపడేలోగా వచ్చెయ్యొచ్చుగా..." అని కారణం చెప్పుకున్నాను. ఎక్కడవిందో మా పాముచెవుల తల్లి "అమ్మా! నేనూ వెళ్తానే అక్కయ్యతోబాటు" అంది. నాకు ఒళ్ళుమండి 'ఆఁ నువ్వేం అక్కర్లేదులే' అన్నాను."

"వొద్దుట! వొద్దు!... పెళ్ళిగానిపిల్ల ఒంటరిగా తిరుగుతుంటే నలుగురూ నా నోట్లోనే ఉమ్మేస్తారు నీకేం?... రాధా! వేరే పరికిణీకట్టుకు వెళ్ళమ్మా..." అంటూ అమ్మ ఆర్డరు జారీ చేసింది. ఎలాగూ విఘ్నం జరిగిందిగదా అని లోపలికివెళ్ళి కాళ్ళు కడుక్కుని మంచినీళ్ళు తాగి వచ్చేసరికి మా రాధకూడ వచ్చేసింది.

ఇద్దరం బయల్దేరి పంచలోకొచ్చాం. ఆ గేటు దగ్గర చెట్టుచాటుగా పొంచివుంది. అది ఏమిటబ్బా? హతవిధీ! ఇదికూడానా? నా కాళ్ళు చల్లబడ్డాయి. కానీ పరికించి చూద్దునుగదా అది పిల్లికాదు! కాగితం!! "విఘ్నం

కురుమే దేవ సర్వకార్యేషు సర్వదా" గణపతిని ధ్యానం చేసుకున్నాను. జరగవల్సిన కార్యక్రమం తల్చుకుంటే గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నయి బాబోయ్! పెద్దపులితో దాగుడు మూతలు!..చెల్లి రిక్షా పిలవడానికి వెళ్ళేసరికి నాకు ఎక్కడలేని భయంవేసింది! మనసుముందుకు లాగుతుంటే కాళ్ళు వెనకు గుంజుతున్నయి. ఎందుకొచ్చిన బాధ! ఊరుకుంటేసరి! అనుకొని అడుగు వెనక్కు వెయ్యబోయాను. 'దేవదాసు.' 'లైలామజ్నూ' లాంటి ప్రసిద్ధ ప్రేమాయణ గాధలన్నీ కళ్ళముందు తిష్టవేసేసరికి నా పిరికితనాన్ని తిట్టుకుంటూ, చెదరి పోయిన ధైర్యాన్ని కూడగట్టుకుని రిక్షా యెక్కాను.

ఇల్లు దగ్గరవుతున్నకొద్దీ గుండె కొట్టుకు చేవేగం హెచ్చవుతోంది. అంతకూ, నా యెరికలోవున్న దేముళ్ళందరనూ పేరు పేరునా పిల్చి మొక్కుకున్నాను. చెప్పొద్దూ ఆ క్షణాన నాకు లక్ష్మిమీదనే కోపంవచ్చింది! అవతల కొండంత బామ్మగారువుంటే ఆవిడను అడగకుండా ఇది గోపీని ప్రేమించెయ్యడమేమిటి? వేరే సంబంధంచేస్తే చస్తానని బెదిరింపు!...లక్ష్మి కళ్ళబడితేనా పచ్చడి చేసేద్దును!

ఆలోచనలోనే వచ్చేసింది యిల్లు. అయినా యీ రిక్షా వాళ్ళాయింతే! రైలుకు వేళవుతోందంటే రాజహంసల్లా పోనిస్తారురిక్షాని, ఇలాంటప్పుడు కొంపలంటుకు పోతున్నట్లు పరుగులు.

రిక్షా దిగుతుంటే నా ముఖంనూశాలి జీరో వాట్ బల్బు ఎక్కువకాంతివంతంగా వుండివుంటుంద! నిలు వెల్లా

వణుకు, చెమటలు! చలిజ్వరం పేషెంటులా వున్నానంటే నమ్మండి...

తలుపు తడ్తూ "బామ్మగారూ!" అనబోయి మళ్ళీ సద్దుకొని "లక్ష్మీ!" అని పిల్చాను.

"ఎవరూ?" అంటూ వచ్చి తలుపుతీసిన బామ్మగారు నన్నుచూసి "అయ్యో పిచ్చితల్లీ! రిక్షాలోవచ్చినా ఎండదెబ్బ తగిలింది. ఇట్లాకూచో యిప్పుడే ఓ చుక్క మజ్జిగ తెస్తా." నంటూ వెళ్ళింది.

బామ్మగారిచ్చిన చిక్కటి మజ్జిగగ్లాసూ త్రాగాక ప్రాణంకొంచెం తేరుకుంది.

"లక్ష్మి ఏదిబామ్మగారూ?" నీరసంగానే అడిగాను.

"లక్ష్మి లేదమ్మా. అరుణవచ్చి పిల్చుకెళ్ళింది. ఈ పాటికి వచ్చేస్తుండాలి చాలాసేపయింది. ఒక్క నిముషం కూచో." అంటూ చాపవెయ్యబోతున్న బామ్మగారితో "లోపల వుక్కగావుందండీ. అలా పంచలో కూచుందాం పదండి" అంటూ పంచలోకొచ్చాను.

బామ్మగారు కూడ చేటలో బియ్యం పోసుకువచ్చి కూచుంది. నేనూ బియ్యం ఏరుతున్నాను.

"అక్కయ్యా! మల్లెపూలే!" మా చెల్లెలు మల్లె పందిరి చూపిస్తూ అడిగింది నా చెవిలో మెల్లగా. నేను కళ్ళతోనే కసిరాను.

ఎలా కనిపెట్టిందో బామ్మగారు "వెళ్ళి కోసుకోమ్మా" అని మా రాధకు ఆర్డరుపడేసి. "అలా కసురుతావేమ్మా?

ఆడపిల్లలకు పూలమీద ఆశవుండదా ?'' అంటూ నన్ను మందలించింది. 'గుడ్ !' బామ్మగారు మంచి 'మూడ్' లోనేవుంది. శుభసూచకమే అనుకున్నాను కాస్త తేరుకున్న నేను.

రాధ ఒక్కపరుగున వెళ్ళి పూలు కొయ్యడంలో నిమగ్నురాలయింది. రెండునిముషాలు బామ్మగారూ నేనూ మౌనంగా బియ్యంలో మట్టిపెళ్ళలు యేరాము. ఇంతలో బామ్మగారు తలొంచుకుని బియ్యం యేరుతునే ''మా లక్ష్మికి పెళ్ళిఅమ్మాయి !'' అంది.

ఒక్కమాటు నా గుండె గతుక్కుమన్నది. అయినా అదేమో నా స్వరంలో వినబడనీయకుండా ''ఓహో ! ఎప్పు డండీ ?'' సాధ్యమైనంత ఆనందం, ఆశ్చర్యం ధ్వనించేలా అడిగాను. ఫర్వాలేదు ! నాకూ నటించడంవచ్చుని మనసు లోనే సంతృప్తిపడ్డాను.

''ఇంకా ముహూర్తాలు పెట్టుకోలేదుగానీ—తొందర్లోనే....''

''ఏవూరిస్తున్నారు ?'' ఎరగనట్టే అడిగాను.

''వాళ్ళ మేనత్తకొడుక్కే నమ్మా. నాకుమాత్రం ఏ పది మందివున్నారు గనుక. దీని నాన్న నా కడుపున చిచ్చు పెట్టిపోనేపొయ్యె. ..మిగిలిందల్లా అదొక్కతేగా. దాని ఒక్క కొడుక్కి దీన్నిచ్చి పెళ్ళిచేసేస్తే నాకు సగంబరువు తీరి పోతుంది ...ఏ క్షణాన రాలిపోతానో....'' బామ్మగారు గద్గద స్వరంతో చెప్పుకుపోతోంది.

ఊరికే "ఊఁ" కొడ్తున్న నాకు వాళ్ళమ్మాయి ఆస్తి వివరాలుగానీ, వున్న నగానట్రా వర్ణనలూ అవేవీ నాకు విన్పించటంలేదు. నా కళ్ళు అలా ఆ గేటు మీదనే వున్నాయి.

అరగంట గడిచింది...

ఇంతలో మెల్లగా గేటు తెరుచుకుని లోపలకొచ్చిందో సోదమ్మి, "సోది సెప్పించుకుంటారమ్మా?... ..." అంటూ. శామ్మగారు వులిక్కిపడి తలెత్తింది... సోది మనిషినిచూసి "యిప్పుడేంవద్దు. వెళ్ళు" అంది.

సోది మనిషి యీవిడమాట విన్పించుకోనట్టే గంప దించుకు మెట్లమీద కూచుంటూ "గాలుండా... దెయ్యముండా, దోసముండా... ...వున్నదున్నట్టు, లేంది లేనట్టు సెబుతా... జరిగేది, జరగబొయ్యేది అద్దంలో చూసినట్టు సెబుతా తల్లీ!..." అంటూ చెప్పుకుపోతోంది.

"నీ కేకదూ చెప్పడం! వెళ్ళు వెళ్ళు." శామ్మగారు వురిమిచూచింది. లావుపాటి కళ్ళద్దాలలోనుండి శామ్మగారి కళ్ళు ప్రత్తికాయల్లా కన్పించాయి.

ఆ సోదమ్మి ఆ కళ్ళను ఖాతరు చెయ్యలేదు. "ధరమ తల్లివి! ఈడనే గంపదించినా, సేతిమీదుగా బోణి సెయితల్లీ! పేరుసెప్పుగుంటా... గుప్పెడు బియ్యం... అంత పచ్చడెట్టినా సాలుతల్లి... యిన్ని బియ్యమేగా?" కూచున్న చోటునుంచి కదలలేదు.

"ఏయ్ అమ్మా! బియ్యానికి మొహం చూసుకుంటా మనుకున్నావా? ఏంటామాటలు?" అంటూ దాన్నికసిరి,

"అబ్బబ్బ! వీళ్లు మొండిమనుషులండీ... పట్టుకుంటే వద లరు." అన్నాను బామ్మగారితో యిహ మీకు తప్పదు కానీండి అన్నట్లుచూస్తూ... ..."మా అమ్మకు యిలాంటి వంటే మహా నమ్మకం. వచ్చినవాళ్ళను పోనివ్వదు." అన్నాను మీకు నమ్మకంలేదా అన్నట్లు! నాకక్కడ యిలాంటివంటే నమ్మకంలేనట్లు...

బామ్మగారు ఏమనుకుందో ఏమో రెండుదోసిళ్ళ బియ్యం చాటలోపోసి, సోదమ్మిముందు కూచుంది.

ఆ అమ్మి కళ్లుమూసుకుని భక్తితో ధ్యానంచేస్తుంటే బామ్మగారు ఎదురుగ్గా శ్రద్ధాభక్తులతో కూచుంది. ఆ సీను చూస్తుంటే నాకు నవ్వాగలేదు.

"ఓయమ్మ! ఏందమ్మ? దేవతను ధానిస్తుంటే నవ్వుత వేటమ్మా?" నా నవ్వుచూసి సోదమ్మి కోపగించుకుంది.

"తప్పమ్మా! నవ్వకూడదు. ఆ ధ్యానమే వాళ్ళకు వాక్కు నిస్తుంది." అంటూ బామ్మగారు నాకు హితబోధ చేసింది.

ఇదీవచ్చి ఎఫెక్టేయిచ్చింది లెమ్మనుకుంటూ తల వంచుకు బియ్యంయేరడం మొదలెట్టాను. సగం నవ్వాపుకో డానికి, సగం నాకేమీ పట్టనట్టుండటానికి...

"పెద్దపులిపుటక తల్లే... సేతి కెముక లేదు... మాటకు తిరుగు లేదు... పెట్టిపుట్టిన తల్లివోయమ్మ... ..." యిలా చెప్పుకుపోతోంది.

ఓమాటు తలెత్తి బామ్మగారి ముఖకవళికలను పరిశీలించాను. ఆవిడముఖంలో సంతోషపుఛాయలు కన్పించాయి. గురికుదిరిందిలెమ్మని నాపని నేను చూసుకుంటున్నట్లుగా నటిస్తున్నాను. సోదమ్మ గతమంతా యేకరువు పెడుతోంది బామ్మగారు ఓమాటు తృప్తిగా నా కళ్ళల్లోకి చూసింది వున్నదున్నట్లు పాపం బాగానే చెబుతోంది అన్న భావం కన్పించిందా చూపులో ...... "భేష్!" అనుకున్నాను మనసులో.

"ఇంతకూ, యిప్పుడు తలపెట్టినకార్యం జరుగుతుందా!" బామ్మగారు అడిగింది.

ఎరుకలసాని అరనిముషం కళ్ళుమూసి ధ్యానంచేసింది. ఇంతలో గతుక్కుమన్నట్టు మొహంపెట్టి భయసంకోచాలతో బామ్మగారివైపు చూసింది.

"అయ్యో! అనుమానం దేనికీ? ...... ఉన్నదున్నట్లు చెప్పు' ఆదుర్దాతో దగ్గరకుజరిగి కూచుంది బామ్మగారు.

"ఓ యమ్మ! మనుమ రాలికి పెళ్ళిమాటడుగుతుండవ్. అయినవారిలోనే, పేగుసమ్మంధమున్నచోటనే యిచ్చుకోవాలనుకుంటుండవ్ ...' సోదిబుర్ర టుంగ్, టుంగ్ మంటున్నది.

"నీవనుకున్నది జరిగితీరుద్ది ...కానీ ..." అంటూ మళ్ళీ ఆపేసింది.

పాపం బామ్మగారి కంగారు మరీ ఎక్కువయింది.

"ఏమిటో ... ఏం జరుగుతుందో ...... భయం దేనికి చెప్పమ్మా?' అంటూ తొందరచేసింది.

ఇక విధిలేక చెబుతున్నట్టు మొహంపెట్టింది సోదమ్మి.

"ఓయమ్మ! మీ కోడలు నీల్లోసుకోనుండంగా, పొద్దు కేళ, పాలకుండకు చుట్టేసుకున్న తాచుపామును చంపిందు మీ యబ్బాయి. టుంగ్ ... టుంగ్ ..." సోదిపుల్ల పట్టుకునన బామ్మగారిచేతిని పైకిచూపిస్తూ "అది జాతిసరపంతల్లే ... అది శాపమెట్టిందిలమ్మో ... టుంగ్ ... తాళిగట్టిన యేడాదిలోగా అమ్మాయి పసుపుకుంకుమ సెరిగిపోతుంది. సరపదోసానికి తిరు గుండదు తగిలి తీరుతుంది. అడిగారు గాబట్టిసెప్పిన... మా గారితోడు ఇంకనేనేం సెప్ప?" సోదిపుల్ల చివరను తన నుదిటికితాకించి గంపలోకి విసిరేసి వుస్సురంటూ కూచుందా అమ్మి, యిలాంటివార్త చెప్పవలసి వచ్చినందుకు మహాబాధ పడిపోతూ.

"ఆఁ!" అంది బామ్మగారు గుడ్లప్పగించి నోరుతెరిచి ఆ అమ్మినిచూస్తూ.

ఐదు నిముషాలదాకా అచేతన శిలాప్రతిమలావున్న ఆవిడనుచూస్తే నాకు గాభరావేసింది. ఆ తత్తరపాటులో "ఏయ్! అమ్మీ! నిజం చెప్తున్నావా? అబద్దాలా?" అని అడిగాను. అయినా నా తెలివితక్కువ కాకపోతే 'నేను నిజం చెప్పలేదు అబద్ధమే చెప్పానని' ఎవరన్నా ఒప్పుకుంటారా చెప్పండి?

ఎరుకలసాని ఒక్క మాటు ఖస్సుమని లేచింది. "ఏడ దొరికినవుతల్లె! ఎరుకలసాని మాటకే తిరుగుసెబుతుండవే! లెంది సెప్పడానికి నాకేటిబట్టింది? నా వాక్కులో పొల్లుంటే

మరి యీ గంపముడితే ఒట్టే! ఆఁ!..." అంటూ విసురున గంపెత్తి చంకనబెట్టుకుంది వెళ్ళిపోవడానికి...

హాసి దీనిదుంపతెగ! గంప ముట్టుకువల్లా ప్రమాణం చేస్తోంది చూడండీ! అన్నట్లు ఆశ్చర్యం ఆరుపాళ్ళు అమాయకత్వం నాలుగుపాళ్ళూ కలబోసి ఓ చూపుచూశాను బామ్మగారివైపు. ఆవిడ మరి నీరసపడిపోయింది.

ఇంతలో ఒడినిండా మల్లెమొగ్గలతో వచ్చిన మా రాధ గేటుతీస్తున్న అమ్మినిచూసి "అక్కయ్యా! ఈ అమ్మిని ఎక్కడో చూసినట్లుందిగదే?" అంది మహా తెలివి తేటలు పండిపోయినట్లు!

ఆ పళంగా చెంపచెళ్లు మనిపించాలనిపించింది. కానీ సమయంకాదని ఆ కోపం దిగమింగి "నీ మొహం యివ్వాళ యీ పేటకొస్తే నిన్న మనపేటకొచ్చి వుండగూడనూ?" అని సర్దేశాను. ఎందుకేనా మంచిదని బామ్మగార్ని గమనించాను. ఆవిడ విన్నదిగానీ ఏమీ పట్టించుకునే స్థితిలోలేదు. దీన్నిక్కడినుంచి తరిమేస్తే మంచిదనిపించి "ఇంక మొగ్గ ల్లేవా?" అని చెల్లినడిగాను.

"చాలా వున్నయిఅక్కయ్యా" అంటూ మళ్ళీ పరుగెత్తిందిరాధ.

బామ్మగారి పరిస్థితి వర్ణనాతీతం. ప్రవాహంలో తన వారినీ ఆస్తినీ పోగొట్టుకుని కట్టుగుడ్డలతో నిలిచిన వరద బాధితునిలా కూచుంది. ఆ కళ్ళల్లో వెనుకటి దర్పంలేదు. మనిషిలో ఆ ఠీవిలేదు. మాటలో ఆ గంభీరంలేదు. కూలిన

ఉల్లులా గోడకి చేరబడిపోయింది. మాటపెకిలి రావటంలేదు. పాపం పెద్దపులిలాంటి బామ్మగారు పిల్లికూనలా మారిపోవడం చూసి నా హృదయం ద్రవించింది. ఇంట్లోతిని యింటి వాసాలు లెక్కపెట్టినట్టు ఆవిడచేతి మజ్జిగ త్రాగి! ఛీ ఛీ! పాపం మనుమడూ మనుమరాలూ కాపురం చేస్తుంటే చూడాలని ఎంత ముచ్చటపడ్డదో పెద్దప్రాణం!

"పోనిస్తూరూ బామ్మగారూ. వాళ్ళేదో చెప్తుంటారు అంతేగాని...వాటికేంటిలెండి" గబుక్కున ఏదో ఆలోచనలో వుండి అనేశాక నాలిక్కరుచుకున్నాను. నయమే! ఇంకోక్షణమయితే నా నోటినుంచి నిజం వచ్చేసేదే సుమండి! ఇంతాచేసి సిద్ధాన్నంలో మట్టిపోసినట్టు, యీ జాలికి వేళాపాళా వుండద్దాఅని నన్నునేనే గట్టిగా కోప్పడుకుని (మనసులోలెండి) పైకి 'అయినా ——ఏ పుట్టలో ఏ పాముందోనని పూర్తిగా కొట్టెయ్యడానికికూడా లేదండీ. వెనక మా పిన్ని విషయంలో అచ్చయిలాగే జరిగిందని అమ్మ చెబుతుంటుంది. (మా అమ్మకు చెల్లెళ్ళేలేరు. 'ప్రాణ విత్త మానభంగమందు బొంకితే అఘము ఉండదు అని వెనకటికో మహానుభావుడు లైసెన్సు యిచ్చేశాడుగా)" దిగులుగా అన్నాను.

బామ్మగారు ఓ మాటు తలెత్తి చెమ్మగిల్లిన కళ్ళను కొంగుతో వొత్తుకుని "అదేనమ్మా! అందులోనూ మా చిట్టెమ్మ దారంపట్టుకు కొండకు ప్రాకినట్లు ఆ ఒక్క నలుసునీ

ప్రాణంగా పెంచుకుంది. చూస్తూచూస్తూ ఎట్లాగమ్మా?" బావిలోంచి వచ్చినట్లున్నాయి ఆవిడమాటలు.

"నిజమే చూస్తూచూస్తూ యెట్లా చేస్తారండీ! అనుమానం పెనుభూతంట! పెళ్ళిగాకే నూరేళ్ళ పంటఅంటారు." అన్నాను ఆవిడ భయానికి యిన్‌డైరెక్టుగా బలపరుస్తూ.

ఇలా అన్నానేగాని యింకో ఆలోచనపోయింది. కొంపదీసి యీావిడ లక్ష్మికలు పెళ్ళిచెయ్యడమే మానేస్తే? సుబ్రకారు ఆలోచనలు సాగంపోవు...అనుకుంటుండగానే బామ్మగారు గబుక్కున నా చేతులు పట్టుకుని "అమ్మాయి! ఈ మాట లక్ష్మితో అనబోకు. ఇలాగని తెలిస్తే అది అసలు పెళ్ళేచేసుకోనంటుంది...ఏదో అన్నసామెతగా ఆ మాటలు నమ్మి పెళ్ళిపెటాకులూ లేకుండా ఎదిగినపిల్లను ఎన్నాళ్ళని యింట్లోపెట్టుకు కూచోను!" అంటూ బతిమిలాడింది బామ్మగారు.

వెదుకబోయినతీగ కాలికి తగిలింది! "అయ్యో! అంతగాచెప్పాలా బామ్మగారూ! నాకుమాత్రం తెలీదా?.. అసలు వీళ్ళమాటలు పూర్తిగా నమ్మడానికీలేదు. నమ్మకుండా వుండటానికీలేదు! నమ్మి పెళ్ళి మానేస్తారా? నమ్మక మీ అమ్మాయికే అన్యాయంచేస్తారా? పోనీ—దగ్గరలో మరే సంబంధం లేదాండీ?" అన్నాను నెమ్మదిగా. ఆమెచేతనే అనిపించాలని.

"లేకేం?...." బామ్మగారు ఆలోచిస్తోంది.... "వాళ్ళ మావయ్యకొడుకే వున్నాడుగా." అంది.

రొట్టెవిరిగి నేతిలోనే పడిందిలెమ్మని ధైర్యంగా వూపిరి తీసుకున్నాను. "ఇక నే వస్తానండి. లక్ష్మి యింకా రాలేదాయె....చీకటిపడితే అమ్మ కోప్పడుతుంది. లక్ష్మికి ఓ మాటు మా యింటికి రమ్మన్నాననిచెప్పండి. మరి నే వస్తాను." అంటూ లేచాను.

"అమ్మాయి! నాకు లక్ష్మి యెంతో నువ్వూ అంతే నమ్మా. ఈ విషయం ఆ అరుణావాళ్ళతోగానీ యెక్కడా గానీ నోరుజారకమ్మ." అంటూ శ్యామ్మగారు మళ్ళీ హెచ్చరించింది.

"అయ్యో! దైవసాక్షి! నేనూ లక్ష్మి మేలేకోరుతాను." అని ఆవిడకు భరోసాయిచ్చి రాధతో యింటిముఖంపట్టాను.

మా వాకిట్లో అడుగుపెడ్తుండగానే అమ్మ "నీ కోసం ఆ శశికళవచ్చి మేడమీాదుందే." అంటూ చెప్పింది. చెప్పులైనా విప్పకుండా మేడమీాదకు పరుగెత్తి "అబ్బ! భలేగా నటించావే!" సంతోషంకొద్దీ తన చెయ్యి గట్టిగా నొక్కేశాను.

"ఏమియాక్షనోపోవే. ఇవ్వాళ్టితో జీవితం ఆఖరనుకున్నా!"

"వేనకు వేలు ప్రేక్షకులను మెప్పించగల్గిన కళా సరస్వతికి ఒక్క మనిషిముందు నటించటం యేంకష్టమే? పెద్ద కబుర్లుగానీ."

"ఆ విషయం వేరుకమలా. నటిస్తున్నట్లు ఆ ప్రేక్షకు లందరికీ తెలుసునన్న విషయం మనకు కొంత గుండెనిబ్బ రాన్నిస్తుంది. ఇదలాకాదే!"

"సర్లేగానీ—ఇంతకూ అంత 'లేట్' చేశావేం ?"

"అమ్మా నువ్విచ్చిన అడ్రసు కనుక్కునేసరికి పెద్దలు కన్పడ్డారు !"

"ఇంటిగుర్తులు చెప్పానుగదే ?"

"ఆ! నీ గుర్తులు నమ్ముకుంటే కుక్కతోకబట్టి గోదావరీదినట్లే! ఆ పట్టాభిపురంలో 'బి' క్లాస్ యిళ్ళనీన్ని ఒక్క మోడలేనా...ప్రతియింటా మందార, గులాబీ పూల చెట్లువుండె. నువ్వు చెప్పిన గుర్తుప్రకారం ఓ యింటిగేటు అలా తీశానోలేదో అల్సేషియన్ కుక్క 'భౌంయ్' మన డంతో మన స్పీడోమీటరు నలభైదాటిందనుకో.

"...పేరుబల్ల (నేమ్‌బోర్డు) లేనియిల్లుగాచూచి మరో గేటుతీశాను. వాకిట్లో పిల్లామేకా చాలామంది వున్నారు. "చచ్చాంరా" అనుకుని పిలుస్తున్నా విన్పించుకోకుండా వచ్చే స్తుంటే ఆ పిల్లలు బయటికల్లావచ్చి పిల్చుకెళ్ళారు...నాకు మాటలుపోయాయి. ఇంత నాస్తికురాల్ని యీ గండం గడిస్తే శనివారం ఓ కొబ్బరికాయ కొడ్తానని దేవుడికి మొక్కు కున్నాను! ఇక యేంచెయ్యటానికీ తోచక తైరుకొట్టాను చూడూ...ఆవిడ పెరుగ్గారెలా వుబ్బిపోయి పాతరవికగూడా బహుమతిచ్చింది యిదుగో! అవాకులూ, చవాకులూ

నాలుగువాగి బయటపడేసరికి 'గాస్‌ఛాంబర్' లోంచి బ్రతికి బయటపడ్డట్లయిందనుకో మనపని.

శశి చెప్పింది వింటుంటే నాకు భలే జాలికలిగింది. ఆప్యాయంగా, స్నేహంతో తన తల నిమురుతూ "ఒక ప్రాణం కాపాడిన పుణ్యం నీకేనే..." అన్నాను.

*　　*　　*　　*

పచ్చటి తోరణాలతో పెళ్ళిపందిరి కలకలలాడుతోంది. మా అమ్మ పెద్ద బెనారసు పట్టుచీరగట్టుకుని హడావుడిగా తిరుగుతున్నాను నేను. ఆ సాయంత్రమే లగ్నం...

క్రితంరోజు ప్రొద్దుటే బామ్మగారు మా యింటికివచ్చి "మా లక్ష్మికి తల్లీ తోడూ యెవ్వరున్నారు? కాస్త అమ్మాయిని ప్రొద్దుటేపంపితిరా కన్యముత్తయిదువ కాస్త వచ్చిన వాళ్ళకు బొట్టైనా పెడుతుంది. ఈ రెండురోజులూ కలకల్లాడుతూ తిరుగుతుంది." అంటూ మా అమ్మను బ్రతిమిలాడింది. అమ్మ సరేనని చెల్లినితోడిచ్చి నన్ను పంపింది. లక్ష్మితరపు బంధువులు బహుకొద్దిమంది వచ్చారు.

ఆ రోజు ప్రొద్దున పదిగంటలయివుంటుంది. అప్పుడే వరపూజ అయి యింటికొచ్చాము. నేను లక్ష్మిదగ్గరకు వెళ్తున్నాను. ఇంతలో అరుణ హడావుడిగా పరుగెత్తుకు వచ్చి నన్ను డాబామీదికి లాక్కెళ్ళింది. అక్కడ ఆయాసంతో ఒకమూల కూలబడి "కొంపమునిగిందే!" అంది.

నా గుండె ఆగినట్లయింది. "ఏం జరిగిందే?" అన్నాను కంగారుపడుతూ.

"ఏముంది ? అంతా బూడిదలోపోసిన పన్నీరయింది ! 'లక్ష్మికి ఏదో దోషంవుంది. ఏడాది తిరిగేలోగా వైధవ్యం వస్తుందని' ఎవరో చెప్పారుట. 'ఛస్తే నా కొడుక్కి యీ పిల్లను చేసుకోనంటూ' మూటాముల్లె సర్దుతోంది మా పిన్ని."

"నాప్రాణాలు పైనేపోయినై. నిలబడలేక క్రింద కూలబడ్డాను... చివరికి అతికష్టంమీద 'మీ గోపీ ఏమంటు న్నాడు !' అని అడిగాను."

"ఏమంటాడు ? 'ఇవన్నీ మూఢనమ్మకాలు ఏమీ జరగదం' టూ అన్నయ్య ఎంతచెప్పినా పిన్ని వినందే ?... 'చూస్తూచూస్తూ చెట్టంత కొడుకును పోగొట్టుకుంటానా' అంటూ ఏడుపు. 'కాదంటే ఏ నుయ్యోగొయ్యో చూసు కుంటాను' అని పట్టుబట్టింది. బాబాయి, మా అమ్మా, నాన్నా ఎవ్వరూ ఏమీ చెప్పలేకపోతున్నారే ! నువ్వేత్వరగా ఏదో వుపాయం ఆలోచించు. ఈ లోగా కొంచెంసేపు బయల్దేర కుండా ఆపుతాను నేనువెళ్ళి" అనిచెప్పి అరుణ వెళ్ళి పోయింది.

నిముషంలో యిల్లంతా గుప్పుమంది. నేను అక్కడే కూచుని ఆలోచిస్తున్నాను. ఇది సింగమ్మగారిపనే. సందేహం లేదు ! ఇందాక వగవ్రూజకొచ్చినావిడ మాతో తిరిగిరాలేదు. పాలుకాచి త్రాగబోతూ ఒలకబోసి కొన్నట్లయింది, ఏం చెయ్యాల్రా భగవాన్ ! అని మెదడుకు సానబెడ్తున్నాను. మనసు గజిబిజిగావుంటే ఆలోచనలే తట్టవ్ !...

"కమలా ! మీ అందరికీ గుడ్ బై !" లక్ష్మి కంపిత స్వరంవిని వెనుదిరిగాను.

లక్ష్మి ముఖం కందగడ్డలావుంది. కళ్ళు యెర్రగా వున్నయి. "అదేమిటే!" ఆశ్చర్యంగా అడిగాను.

"అవునే. కోరినవరుణ్ణి, పీటలమీద పెళ్ళి తప్పి పొయ్యాక యే ముఖంపెట్టుకుని బ్రతకనే! రైలు క్రింద తల పెడితే ఐదు నిముషాలుపట్టదు యీ పాడు బ్రతుకు అంతంకావడానికి..." లక్ష్మిమాటలు అసలే మెదడులో కుస్తీపట్లు పడ్తున్నానేమో అరికాలిమంట నెత్తికెక్కింది.

"ఇదుగో! పిచ్చిపిచ్చిగా వాగావంటే పోలీసుల్ని పిలుస్తాను ఐ. పి. సి. త్రీనాట్ నైన్ క్రింద జైల్లోపెడ్తారు. శిక్ష తిన్నగా కుదురుతుంది" అన్నాను చిరాగ్గా.

"హుం! జైలుగోడలు మనుష్యుల్ని బంధించగలవు గానీ, మనసుల్ని బంధించగలవుటె?"

"ఓహో అలాగయితే... మాచెర్ల రైలు వచ్చే వేళయింది. ఏ మాత్రం చస్తావో చూస్తాను పద... అసలిలా యింకా వాగుతుండు బామ్మగార్ని పిల్చుకొస్తా. కాళ్ళూ చేతులూ కట్టిపారేస్తారు." విసుగ్గా అన్నాను.

"అవేంమాటలే?... లక్ష్మి బిక్కముఖంతో అడిగింది. కళ్ళకుపెట్టిన కాటుక ముఖమంతా అయింది. తీర్చిదిద్దిన కళ్యాణపుబొట్టు కొద్దిగా చెరిగింది. వచ్చినట్లుంది కన్నీటి చారికలతో ముఖం వివర్ణమయింది. దానిముఖంచూస్తే యెందుకన్నానా అని జాలేసింది.

"కాకపోతే యేమిటిలక్ష్మి!... కష్టమొచ్చినప్పుడు తప్పుకునే వుపాయం ఆలోచించాలిగానీ చచ్చి యేంసాధి

స్తావే?...ఇక్కడేమో యేంచేద్దామూఅని తలబ్రద్దలు కొట్టు కుంటుంటె ఒక్క క్షణం ఆలోచించుకోనీకపోతివి. ఈ సంబంధం తప్పిపోతే మాకుమాత్రం సంతోషమా?......అమాత్రం మమ్మర్థంచేసుకోకపోతే యెలానే!......అన్నట్లు దగ్గర్లో యెక్కడైనా ఫోనుందా?..." అని అడిగాను.

ఏమనుకుందో యేమో లక్ష్మి "మనింటికవతల మూడోయింట్లో వుంది ఫోను." అని చెప్పింది.

నేను గబగబా క్రిందికివెళ్ళాను ఫోన్ చెయ్యడానికి. నేనుతిరిగి వచ్చేసరికి దిగువహాల్లో దిగాలుపడి నిల్చున్నది బామ్మగారు. పక్కనే సింగమ్మగారు నిలబడి, "పోనీవే...... ఘోర్యేవాళ్ళను బ్రతిమాలేదేమిటి? ఇదికాకపోతే దీనితాత లాంటి సంబంధం మరోటి...అంతగా దొంక్కపోతే మన పిల్లమనకు బరువా? మనింట్లోనే వుంటుంది" అంటూ యింకా ఏమేమో నూరిపోస్తోంది.

నాకు ఆవిడముఖం చూడగానే ఒళ్ళు మండిపోయింది. కాస్త హెచ్చుస్థాయిలో "అదేంటండీ? ఫలానా తులసమ్మ గారి మనుమరాలికి పీటలమీదపెళ్ళి తప్పిపోయిందంటే ఆ నామోషీ ఆవిడకా? మీకా?...ఇంతదాకా ఆవిడను వేలెత్తి చూపించినవాళ్లులేరు. అసలు పీటలమీదపెళ్ళి, పైగా మేనమామకొడుకే తిరిగిపొయ్యాడంటే వేరే సంబంధం ఎలా కుదురు తుందండీ? మీరేచెప్పండి బామ్మగారూ! పెళ్ళి చెయ్యకుండా మీరున్నన్నాళ్ళు గుండెల్లోపెట్టి చూసు కుంటారు. కానీ—ఆనక దానిగతి? అన్నీ బాగా ఆలోచిం

చండి బామ్మగారు...అయినా ఆడపెళ్ళివారం ఆ మూడు ముళ్ళూ పడేదాకా అణగిమణిగే వుండాలి... మీరు రండి బామ్మగారు మీ ముందు వాళ్ళు నోరేఎత్తరు" అంటూ పెద్ద ఆరిందాలా ముందునేనే దోవతీశాను. చంటిపిల్లలా నా వెనకాలే వచ్చింది బామ్మగారు.

"చిన్నదయినా సభ మెచ్చే మాట చెప్పింది." ఓ పెద్ద ముత్తయిదువ వెనుకనుండీ మెచ్చుకుంటోంది

దుఃఖం అనేది ఎంతటి ధీరుల్నిగూడా బోల్తాకొట్టిస్తుంది. పాపం బామ్మగారు పెళ్ళికొడుకుతల్లి కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలుతోంది. ఆవిడమాత్రం పట్టినపట్టు విడవటం లేదు.

చూసిచూసి పక్కనేవున్న నేను "తండ్రి తర్వాత తండ్రంతటివాడు మేనమామ. తల్లిలేని పిల్లను మీరే యిలా రచ్చకెక్కిస్తే దాన్నిబతుకేంకావాలో ఆలోచించండి!" అన్నాను

"నువ్వూ అట్లాఅంటావేం కమలా? ఇలాంటి విషయాల్లో యే తల్లిమాత్రం ఒప్పుకుంటుంచా చెప్పు?... ..." అరూ వాళ్ళ పిన్ని సూటిగా ప్రశ్నించింది.

"మీకున్న అనుభవంలో నాకేపాటి చెప్పండి. మీకు చెప్పతగ్గదాన్ని కాననుకోండి. అయినా—గిట్టనివాళ్లు లక్ష కల్పిస్తారు అన్నింటినీ పట్టించుకుంటే యెలా చెప్పండి! లక్ష్మిది దివ్యమైన జాతకం. అంతగా మీకనుమానంవుంటే మంచి జ్యోతిష్కుడ్ని పిలిపించి చూపించుకోండి. అనుమాన

నివృత్తి అవుతుంది. ఎలాగో ముహూర్తానికి యింకా వ్యవధి వుందిగదా..." అని నచ్చచెప్పిచూశాను.

"ఏ దోషమూ లేకపోతే మేనత్తకొడుక్కిచ్చ్వాలని ముహూర్తాలుకూడా పెట్టుకోబోయినవాళ్లు యెందుకు మాను కున్నట్లు?... దీనికేం జవాబిస్తావ్?..." అంటూ యెదురు సవాలు చేసింది.

వానికేం జవాబుచెప్పను? "ఇక్కడ నలుగురూ పోగవుతున్నారు. అట్లా పెళ్ళిపందిట్లో మాట్లాడుకోవచ్చు రాండి." అంటూ నెమ్మదిగా నేనూ అరూ కలిసి వాళ్ళను విడిదినుండి పందిట్లోకి తీసుకొచ్చాం.

మాటలు సాగుతూనేవున్నాయి. బామ్మగారు వియ్యాపు రాలిచేతులు పట్టుకుని "ఇది చేతులుకావు కాళ్ళనుకోమ్మా. పెద్దదాన్ని నా పరువు నిలుపమని" బ్రతిమాలుతున్నది.

ఈలోగా సింగమ్మగారు, ఆవిడ సుపుత్రుడు ఆ పరిస రాల్లో లేకుండా నేను తగిన జాగ్రత్తలు తీసుకున్నాను.

'ఓయమ్మా! మనుమరాలి పెళ్ళిసేత్తుండవ్ నాకింత పప్పన్నం యెయ్యావేంటి?...' అనే మాటలువిని దీనాతి దీనంగా బ్రతిమాలుతున్న బామ్మగారు వులిక్కిపడి పక్కకు చూసింది.

చంకన గంపతో ప్రత్యక్షమైన సోదమ్మని చూడ గానే ఆవిడ దుఃఖంతో కోపంగానూ, దీనంగానువున్న ఆ చూపులు తీక్షణంగానూ రూపాంతరం పొంది దానిమీదకు

మళ్ళింది. "మళ్ళీ దాపురించావ్ ? ఫో, అవతలికి ముందు నీ మూలానే యింతా జరిగింది" అంటూ గుడ్లురిమి అతిక్రీక రంగా చూసింది దాన్నివైపు కోపంగా ఎర్రగా జేవురించిన ఆ ముఖం చూడ్డానికి నాకే భయం వేసింది !

"ఏటమ్మా, గుప్పెడన్నం పెట్టమంటే అంతలా కసురు కుంటావ్ ?..." సోదమ్మ నిర్లక్ష్యంగా అడిగింది.

ఆ నిర్లక్ష్యం, ఆ జవాబుతీరు చూసి బామ్మగారు వుగ్రురాలైంది. కళ్ళు అగ్నిని వర్షిస్తున్నాయి. "పోతావా ? మెడబెట్టి గెంటమంటావా ?..." అంటూ చెయ్యెత్తింది బామ్మగారు.

"ఏందమ్మో, ఎవరనుకుంటున్నావ్ ? మాటలు సరిగా రానీ..." అంటూ గంప నేలకేసి కొట్టి, కొంగుదంచి కొప్పు విదిలించు నిలబడింది మా శశి.

శశిని చూసి అరూ, వాళ్ళమ్మ, నాన్న, బాబాయి, పిన్ని పందిట్లో అందరూ నిర్ఘాంత పొయ్యారు. అరూ వాళ్ళ పిన్ని ఆశ్చర్యంగా "ఇదేంటమ్మా శశికళ! ఈ వేషం ఏమిటి? ఏమి టిదంతా ?..." అని అడిగింది.

ఎంత వుగ్రంగా వుందో అంత ఖంగుతిన్న బామ్మ గారు "దీన్ని నువ్వెరుగుదువా ?..." అని ప్రశ్నించింది ఆశ్చర్యంగా చూస్తూ.

'అయ్యో ! నే నెరక్కేమండీ ? మా యింటికి యెప్పుడూ వస్తూనేవుంటుంది అరుణా వాళ్ళ స్నేహితురాలు" అని చెప్పింది.

పందిట్లో నిశ్శబ్దం అలుముకుంది. అందరి చూపులూ అక్కడే కేంద్రీకరించినయి.

మా శశి యింతలో ధైర్యంగా బామ్మగారి ముందు నిలబడింది. "దీని కంతా నేనే కారణమండీ. మీరు యే శిక్ష విధించినా అనుభవించడానికి సిద్ధంగా వున్నాను" అంది సౌమ్యంగా.

అదలా అనంగానే దగ్గర్లోనేవున్న నేనూ అమూ దానికి చెరో ప్రక్కనా నిలబడి "బామ్మగారూ! ఒకటి రెండు ముద్దాయిలం మేము. ముందు మమ్మల్ని శిక్షించి తర్వాత దాన్నేమన్నా అనండి." అన్నాం ధైర్యంగా.

బామ్మగారికి ఏమీ అర్థం కాలేదు. అయోమయంగా మావైపు మాస్తూ "ఏమిట్రా యిదంతా?..." అన్నది.

ఈమధ్య బామ్మగారితో యేర్పడ్డచనువుని పురస్కరించుకొని నేనే ధైర్యంగా అసలుసంగతి చెప్పడానికి సాహసించాను. "బామ్మగారూ! మీ మనుమరాలు లక్ష్మి, వాళ్ళబ్బాయి గోపి ఒకర్నొకరు ప్రాణంగా ప్రేమించుకున్నారు. గోపీనితప్ప యీ జన్మలో యింకెవ్వరినీ పెళ్ళి చేసుకోనని లక్ష్మి మాతో చెప్పింది. మీరు లక్ష్మిని మీ మనుమడికివ్వాలనుకోగానే తను ప్రాణత్యాగమైనా చేస్తానుకానీ యింకోర్ని పెళ్ళిచేసుకునే మాటకల్ల అని ఖచ్చితంగా చెప్పేసింది. దాని మనసూ, గుణం మాకు తెలుసాయె. అది అంతపనిచేసినా చేసితీరుతుందని మాకు భయంవేసింది. దాని ప్రాణం కాపాడాలని యీ పెళ్ళి యెలాగైనా తప్పించాలని

శశిచేత సోదమ్మవేషం వేయించి యీ నాటకం ఆడాము. అంతేగాని దాని జాతకంగానీ, గుణదోషాలుగానీ మాకేమీ తెలియవు. లక్ష్మిమీదున్న అభిమానంకొద్దీ యిదంతా చేశాం. మా తప్పుకు మమ్మల్ని శిక్షించండి. మీ యిష్టంవచ్చిన వాళ్ళకు మీ పిల్లనిచ్చుకోండి" అని అంతా వివరంగా చెప్పాను.

ఇంతలో అక్కడేవున్న మా చెల్లి "అక్కయ్యా! ఎక్కడో చూసినట్లుందని అనాడే నే ననలేదుటే..." అంది డి. డబ్ల్యు. నెం. 1 గా ఆరోజు వచ్చింది శశేనని సాక్ష్య మిస్తూ. ఆరోజు విసుక్కున్నా పెద్దది అమ్మమాటచెప్పిన దీన్ని తీసుకురావడం యీరోజు మంచికే అయిందని చాలా సంతోషించాను.

ఇంతదాకా పందిట్లో నిలబడి చోద్యం చూస్తున్న మరో ఆవిడ "ఐతే శశీ! ఎవరో ఫ్రెండ్‌ని తమాషా చెయ్యాలని ఆ రోజు మా యింట్లో అంతా వేషం వేసింది యిందుకటే?..." అని అడిగింది. ఆవిడ ఆ పేటలోనే వుంటున్నది. శశికి దూరపుబంధువు. ఆవిడ డి. డబ్ల్యు నెం. 2 గా యిచ్చిన సాక్ష్యం మాకు మంచి బలమిచ్చింది. భగవత్ కృపవల్ల యిలా అనుకోకుండా సమకూరినందుకు మనసులో వేయి నమస్కారాలు పెట్టుకున్నాను భగవంతునికి.

ఇంతటిదాకా తలుపుచాటునుండి యిదంతా వింటున్నదిగాబోలు లక్ష్మి, "ఈ బొందిలో ప్రాణంవుండగా నేను గోపీబావను తప్ప మరెవ్వరినీ చేసుకోను" అనేసింది నిక్క

యంగా. వాళ్ళ బామ్మముందు అదంత నిర్భయంగా మాట్లాడగలదని నేను కలలోగూడ అనుకోలేదు !

"ఐతే లక్ష్మితో పెళ్ళవుతుంది. లేదా నేనూ యావజ్జీవితం బ్రహ్మచారిగానే వుండిపోదల్చుకున్నాను" అని మెల్లిగా తన నిశ్చయాన్ని తెలియజేశాడు పెళ్ళికొడుకు, తాపీగా తల వంచుకు కుర్చీలో కూర్చుని! ఏమీ ఎరగనట్లున్న వీళ్ళిద్దరూ యింత నిర్భయంగా మాట్లాడేసరికి నేనేకాక అరూ, వాళ్ళ చుట్టాలు అంతా నివ్వెరపోయి చూశాం

ఇంతదాకా గుడ్లప్పగించి జరుగుతున్నదంతా చూస్తున్న బామ్మగారు కళ్ళు యింతంత చేసి గుండ్రంగాచేసి త్రిప్పుతూ ముక్కుమీద వేలేసుకుని "హారి పిడుగుల్లారా !!!" అంది. ముడతలుబడ్డ ఆవిడముఖంలో మొదట ఆశ్చర్యం ఆ తర్వాత దాన్ని తరిమేసి చిన్నమందహాసం చోటు చేసుకున్నది. పందిట్లో నలుగుర్నీ సంతృప్తిగా చూస్తూ "సరే కానీండి. ఈ కథ యింతదూరం వచ్చాక అందరం అక్షింతలు వేద్దాం పట్టండి" అంది.

పెద్దలంతా "తథాస్తు!!" అన్నారు. ఇక మా ముగ్గురి ఆనందం వర్ణనాతీతం. పెళ్ళిపెద్దలం మేం ముగ్గురమే నని వేరే చెప్పాలా ? ..

(ఆంధ్ర సచిత్ర వారపత్రికనుండి.)

# ఎన్. జి. ఒ.

పైన తిరిగే సీలింగుఫాన్‌కంటె వేగంగా తిరుగుతున్నయి రమేష్ మెదడులో ఆలోచనలు. ధూమదేవతకు వెలిగించిన అగరువత్తిలా సిగరెట్ కాలుతోంది చేతిలో. పొగ వయ్యారంగా రింగులు తిరుగుతూ నాట్యంచేస్తున్నట్లు పోతోంది...

అతడిచూపు యిక్కడెక్కడా లేదు. కిటికీదాటి ఆఫీసు చుట్టూవుండే ముళ్ళకంచెమీదవుంది. అది కత్తిరించి యెన్నాళ్ళయిందో యెగుడుదిగుడుగా పెరిగివుంది!...

చైయిన్‌స్మోకింగ్‌తో నల్లబారిన రమేష్ పెదాలమీద చిన్న చిరునవ్వు మెరిసింది. 'ఇదీ యీ ఆఫీసులోని వుద్యోగుల ప్రవర్తనలానేవుంది.' అనుకున్నాడు. అతడిచూపు ఎదురుగ్గావున్న టేబిల్‌మీద ఫైల్స్‌వైపు మళ్ళింది. ఏదో ఆలోచిస్తూ కాలింగ్‌బెల్ నొక్కాడు.

వెంటనే స్వింగ్‌డోర్ తలుపులు తెరుచుకున్నాయి.

"సార్!" అన్నాడు ప్యూను మెల్లిగా.

"మిస్టర్ మూర్తి."

రమేష్ ముఖం గంభీరంగావుంది. అతడిక్కడికి ట్రాన్స్ఫర్‌అయి క్రొత్తగా వచ్చిన అధికారి. ఆఫీసులో ఛార్జి తీసుకోగానే యెన్నో సమస్యలు యెదురయ్యాయతనికి. అన్ని సమస్యల్ని అవలీలగా పరిష్కరించగల్గిన అతడికి మూర్తి

ఒ గడ్డుసమస్యఅయి కూచున్నాడు. అసలకి అంత విషమ సమస్యగా పరిణమించడానికి కారణం యింతకు పూర్వమున్న అధికారి మూర్తి గురించి చెప్పిన పరిచయవాక్యాలు అయ్యుండచ్చు.

డోర్ తలుపులు చప్పుడయ్యాయి.

"శిలాచ్చరట?..."

లక్ష్యంలేని ఆ మాటతీరు విని ఆ వ్యక్తిని నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడు రమేష్.

దువ్వేనకే లొంగనట్లున్న బిరుసు జుట్టు చూడగానే రమేష్‌కు మనిషి ఆలోచనలకు ముఖం ప్రతిబింబమంటారుగానీ, మనిషి ప్రవర్తనను పట్టియిచ్చే జుట్టు తీరేమో అనే అనుమానం కలిగిందో క్షణం. మాసినగడ్డం, నలిగిన బట్టలు, ఇక్ష్వాకులనాటివిలావున్న చెప్పులు. ఇదీ అతడి వాలకం. ఇక చూపుల్లో ద్వేషం, క్రోధం, నిర్లక్ష్యం యివన్నీ కరుడుగట్టివున్నట్టున్నాయి.

రమేష్ తన మనసులోని భావాలేవీ ముఖంలోకి రానీయకుండా చాలా మామూలుగా "మిస్టర్ మూర్తీ! టేక్ యువర్ సీట్!" అన్నాడు.

మూర్తి కొంచెం తెల్లబోయ్యాడు. ఒక మాటు అధికారివైపు నిర్లక్ష్యంగా చూసి బర్రుమని కుర్చీ లాగి కూర్చున్నాడు.

"మీ దగ్గరకు పంపిన ఫైల్స్‌లో ఏదో ఒక కాగితం కన్పడటం లేదంటున్నాడు హెచ్. సి, గారు?" రమేష్ అతడి ముఖకవళికల్ని జాగ్రత్తగా పరిశీలిస్తూ ప్రశ్నించాడు.

"ఫైల్సులో వుంటే యెక్కడికి పోతుంది ?..." నమ్రత లేని జవాబు.

"ఓ ! ఐసీ !..." తల వూపాడు రమేష్. "అదిసరే... జరిగి పోయిన క్వార్టర్లీ రివ్యూ సకాలంలో పంపలేకపోవడానికి కారణం ?..."

కుర్చీలో వెనక్కు జేరగిలబడి కాళ్ళూపుకుంటూ "అది ఎప్పుడో పంపించేశానుగా..." అని జవాబిచ్చాడు మూర్తి.

"మరి హెడ్డాఫీసునుండి పంపలేదని డి. ఒ. వచ్చిందే?"

"వాళ్ళకు అందలేదో లేక యెక్కడైనా పారేసుకుని పంపలేదంటున్నారో ?..." టేబిల్ మీదకు వంగి చెయ్యిపెట్టి చెప్పాడు.

"ఐసీ ! ఐసీ ! ఇక మీరు వెళ్ళవచ్చు. వెళ్ళి వెంటనే క్వార్టర్లీ రివ్యూ కాపీతీసి పంపించండి." రమేష్ ఫైల్సు తిరగేస్తూ చెప్పాడు.

మూర్తి లేచి వెళ్ళిపొయ్యాడు. స్ప్రింగ్ డోర్ తలుపులు కిటకిటా కొట్టుకున్నాయి.

"ఛీ ! సభ్యత తెలియని మనిషి !" రమేష్ యేవగించుకున్నాడు. సిగరెట్ యాష్ట్రేలోకి విసిరేసి మళ్ళీ కాలింగ్ బెల్ నొక్కాడు.

"సార్ ?"

"హెచ్. సి."

క్షణంలో హెచ్. సి. వచ్చాడు. వయస్సు యాభై దరిదాపుల్లో వుండొచ్చు. పాత గోల్డుగోల్డు ఫ్రేము. ఒంటి నున్న పసుపుపచ్చకోటు అతడికున్న సర్వీసును అడక్కుండానే చెప్తుంది. ' నా వుద్యోగానుభవంతోనే పండి రాలిపోయింది నా జుట్టు, అని గర్వంగా చెప్పుకుంటుంటాడతడు ఆప్యాయంగా రాగిచెంబులాంటి బట్టతలను నిమురుకుంటూ గుమాస్తాలతో.

పొట్టిగా, లావుగా, పచ్చటి ఛాయతో వున్న ఆయన్ను చూడగానే గుమ్మడిపండు జ్ఞాపకం వస్తేరావచ్చు. అతడు వస్తూనే రెండుచేతులూ జోడించి "నమస్కారంసార్! నమస్కారం." అన్నాడు.

"నమస్కారం. కూర్చోండి రామనాథంగారూ!"

"చిత్తం. ఫరవాలేదుసార్." అతడు చేతులు నలుపుకుంటూ అక్కడే నిలబడ్డాడు.

అతడి వాలకంచూసి లోలోన నవ్వుకున్నాడురమేష్. "మిస్టర్ రామనాథం! బి. త్రీ. తనసీటుకు ఆ కాగితం రాలేదంటున్నాడు?"

"లేదుసార్! టపాలో నేనే సార్ అతడికి డిస్ట్రిబ్యూట్ చేసింది. అతడే చించేసుంటాడు సార్ ఆ కాగితాన్ని..."

"ఓ! ఐసీ!...ఆ క్వార్టర్లీ రివ్యూకూడ పంపించేశానంటున్నాడు?"

"లేదుసార్ ! పంపించలేదు. అతడసలు యేపీ సకాలంలో చెయ్యడుసార్. ఎక్స్‌ప్లనేషన్ యిచ్చాక..."

"పీరియాడికల్ రిజిస్టరు వెరిఫై చెయ్యండి." అర్ధోక్తిలోనే చెప్పాడు రమేష్.

"లేదుసార్. ఒక్కొక్కప్పుడు రిజిస్టరులో డిస్పాచి అయినట్లురాసి చించేస్తుంటాడు సార్..." అతడు కొంచెం దగ్గరగావచ్చి చిన్నగా చెప్పాడు.

"వాట్ ! !..." ఆశ్చర్యంగా చూశాడు రమేష్.

"నిజంసార్ !" రామనాథం మరి కొంచెం దగ్గరగా వచ్చి రహస్యం చెబుతున్నట్లు "అతడంతేసార్ ! ప్రతికాగితం త్రొక్కిపట్టేస్తాడు సార్. ప్రతిదానికీ 'కొరి' వెయ్యడం. తన వర్క్ చకచకా చెయ్యడుసార్. అడిగితే 'కస్సు' మంటాడు. ఆయనగారు మీకు చెప్పేవుంటారు సార్. ఎంత తల పొగరనుకున్నారుసార్ !...అధికార్లంటే నిర్లక్ష్యం !... పైగా మిగతా గుమాస్తాలను యీసడించి పారేస్తాడు సార్— మేము అధికారులంటే వసవసలాడ్తామట ! ఆ మాత్రం వినయం, విధేయత లేకపోతే యెట్లాచెప్పండి సార్? ఆ బ్రిటీషు వాళ్ళ కాలంలో యెంత అణకువా ..ఎంత..."

"రామనాథంగారూ !..."

చేతులు త్రిప్పకుంటూ చెప్పుకుపోతున్నవాడల్లా ఒక్కమాటు "సార్ !" అంటూ గబుక్కున చేతులు కట్టుకుని సరిగ్గా నిలబడ్డాడు. ఎక్కాలొప్పజెప్పే ఎలిమెంటరీస్కూలు విద్యార్థిలా.

"ఆఫీసు యిన్‌స్పెక్షను దగ్గర్లోపడింది. మీ వర్క్, యేమీ పెండింగ్‌లో లేదుగా..."

"లేదుసార్. నే నెప్పుడూ పెండింగ్‌లో వుంచనుసార్. రాత్రి పదిదాకా పని చూసుకుంటూంటాను సార్. అస లందరం పొద్దున్నే యెనిమిది గంటలకల్లా ఆఫీసుకు వస్తే ఆ మూర్తి ఒక్కడే సార్. చాలా లేటుగా వస్తాడు. వస్తాడా; అట్లా ఐదుఅయీ అవగానే వెళ్ళిపోతాడు. ఇంక ఆ...... టైపిస్టు ... ఆలస్యం అక్కడే సార్."

"ఆఫీసవర్స్‌లో పని చకచకా చేసుకుంటె రాత్రి పూట పని చెయ్యాల్సిన అవసరమే వుండదు. నాకలా చెయ్యడం యిష్టంకూడా లేదు... ఆఁ యిక మీరు వెళ్ళ వచ్చు..."

"చిత్తం, చిత్తం." రామనాథం చెవిదగ్గరగా వంగి మెల్లిగా "సార్! తమ సామాను అదీ వచ్చేసిందాండి?" అని అడిగాడు.

"ఇంకా రాలేదు. ఏం?"

"అహఁహఁ......మంచాలు అవీ లేకపోతే మీరు యిబ్బంది పడకండి సార్. మా యింట్లో కావల్సినన్ని మంచా లున్నయి. పంపిస్తాను సార్."

"థాంక్స్!... రేపో మాపో సామాను వచ్చేస్తుంది ఇంక అక్కర్లేదులెండి" అని చెప్పాడు రమేష్.

"సార్!" చేతులు తెగ నలుపుకుంటూ ముందుకు వంగి చాలా మెల్లిగా "వెనుకటి ఆఫీసరుగారు నాకు ప్రమో

పనుకి...రికమెండ్...హిహిహిం... చేస్తామన్నారు సార్. హిహిహి...ఏదో...తమ..." అంటూ మెల్లిగా గొణిగాడు.

"చూద్దాం లెండి. మీరు వెళ్ళి పని చూసుకోండి" అంటూ ఫైల్స్ చూసుకోడం మొదలెట్టాడు రమేష్.

"చిత్తం" అంటూ మరోమారు వంగి నమస్కారం చేసి వెళ్ళిపోయాడు రామనాథం.

మళ్ళీ కాలింగ్ బెల్ 'క్రిరు' మంది.

"సార్?"

"మిస్‌లతా. ప్లీజ్"

మళ్ళీ తలుపుల కిటకిట. ఆ వెంటనే ఓ సుకుమారి ప్రవేశం జరగడానికి ఐదునిముషాలు పట్టింది. సన్నగా వుల్లిపొరలాంటి నైలాన్‌చీర, సగందాకావదిలి ఆతర్వాత అల్లిన జడలో 'వుండనా రాలిపోనా' అనుకుంటూ ఒక్కటే ఒక్క గులాబీపువ్వు. కళ్ళు చిన్నవే అయినా యించుమించు చెవుల దాకా తీర్చినకాటుక. గాల్లో తేలిపోతునట్లు వయ్యారంగా వచ్చిన మించుబోడి "నమస్తే!" అంది నాజూగ్గా.

ఫైల్స్‌లోంచి తలెత్తి "నమస్తే! కూర్చోండి మిస్ లతా!" అన్నాడు రమేష్

"అహఁహ! ఫర్వాలేదు లెండి." అలాగే నిలబడి వొయ్యారాలొలకబోస్తూ అంది లత.

ఒకమాటు పరిశీలనగా చూచాడు రమేష్.

"మిస్‌లతా! నేనేమన్నా పెద్దపులినా? సింహాన్నా? ఎందుకలా మెలికలు తిరిగిపోతారు?... ...కూర్చోండి." తీవ్రంగా అన్నాడు.

బెంబేలు పడిపోయిన లత గభాలున కుర్చీలో కూచుంది.

"మీ వర్కంతా పూర్తయినట్లేనా ?" తలవంచుకుని ఫైల్స్‌చూస్తూనే అడిగాడు.

"లేదండీ. నాది చాలా డెలికేట్ హెల్త్... కొద్దిగా పెండింగ్ వుండిపోయింది." చీరచెంగు వ్రేలికిచుట్టుకుంటూ అన్నది.

"మిస్‌లతా! మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకో వాల్సిన బాధ్యతమీది... ఆఫీస్‌వర్క్ అయ్యేలా చూసే బాధ్యతమాది... రేపీపాటికి పెండింగ్‌లోవున్న పనంతా పూర్తిచెయ్యాలి. ఇక వెళ్ళండి." కటువుగా చెప్పేశాడు రమేష్.

ఓ మాటు పమిట సర్దుకొని వచ్చేస్తున్న లత ముఖం పైసాంత అయింది: కన్నీళ్లొక్కటే తక్కువ, ఏడుస్తోం దన డానికి...

* * * *

ఆ రోజు ఆదివారం. ఆదివారం వచ్చిందంటే హుషా రుగా గడిపే రమేష్ ఆనాడు యేవో ఆలోచిస్తూ కూచు న్నాడు.

అతడి మౌనానికి కారణం తెలియని అతడి శ్రీమతి, ప్రపుల్ల ఒకటికి నాలుగుమాటు పలుకరించింది. 'అలావున్నారే మని' ప్రశ్నించింది. అయినా సరైన సమాధానం రాలేదు.

ఆ రోజు ప్రొద్దుటే రామనాథం వచ్చి వెళ్ళాడు. అతడు వచ్చి వెళ్ళినప్పటినుండి అగ్నిలో ఆజ్యంపోసినట్లు మండిపడ్తు న్నాడు రమేష్. అతడికళ్ళల్లో——పై గుండీలు పెట్టుకోకుండా వదిలేసి. చొక్కా-చేతులు పైకి ముడుచుకుని, లక్ష్యం లేని చూపులు చూస్తున్న మూర్తిరూపం మెదులుతోంది. తనను చూచి క్రిందివుద్యోగులు వసవస లాడాలనేమనస్తత్వం కాదతడిది. అసలు రమేష్‌కు అలాంటి వాళ్ళంటే అసహ్యం కూడా. కేవలం మర్యాదగా ప్రవర్తిస్తేచాలు. మూర్తి ప్రవర్తనగానీ, అతడి పనిగానీ నచ్చలేదు రమేష్‌కు. పైగా వుదయంవచ్చిన రామనాథం మరోముక్క-గూడా చెవినివేసి వెళ్లాడు——మూర్తి లంచాలు బాగా పడ్తాడట. ఏదో ముట్ట చెప్పందే కాగితంమీద కలంపెట్టడట!...

రమేష్‌కు సాటిమనిషిగా అతడిమీద ఏపాటి గౌరవం మిగిలివున్నా అదికాస్తా యీ ముక్కతో తుడిచిపెట్టుకు పోయింది. అతడు దొంగవ్యాపారస్థులన్నా, పైడబ్బు కాజేసే రకమన్నా భగ్గున మండిపడతాడు. దానికితోడు "ఈ ఆఫీసర్లు నన్నేం చెయ్యగలరు?" అంటుంటాడు మూర్తి అనికూడ చెప్పివెళ్ళాడు రామనాథం.

'ఛీ! చేస్తున్న నీచమైనపనికి సిగ్గుపడక ఎంతధీమా!' ఎంతపొగరు! సంఘానికి చీడపురుగుల్లాంటి యిలాంటివాళ్ళను పీకిపారేస్తాను. వార్నింగ్ ఇచ్చిచూస్తాను. దానికీ లొంగకపోతే ఎంక్వయిరీ పెట్టించి యితడి అంతేదో తేల్చుకుంటాను అనుకున్నాడు రమేష్.

రమేష్ 'కో' అంటే కోటిమంది కాకపోయినా కనీసం ఓ పదిమంది సేవకులు 'బాబూ' అంటూ పరుగెత్తుకువచ్చే యింట్లో పుట్టాడు. అడిగింది 'లేదు' అనని తిండి, అపురూపంగా చూచుకునే తల్లి. క్లాసులో ఫస్ట్, ఆటల్లో బెస్ట్ అనిపించుకున్నాడు. డైరెక్ట్ రిక్రూట్‌మెంట్‌లో గెజిటెడ్ పోస్టుకి ఎపాయింట్ అయ్యాడు. కోరిన యువతినే శ్రీమతిని చేసుకున్నాడు అతడి జీవితం వడ్డించిన విస్తరి. జీవితం అంటే పూలతోట కాదు, ముళ్ళకంప అని నెవరన్నా అంటే నమ్మలేని దతని జీవితానుభవం. ఇదివరలో వుద్యోగం చేసినచోట బ్రహ్మరథం పట్టించుకున్నాడు.

ఇక్కడికి వచ్చాక యీ మూర్తి అతడికి శాంతి లేకుండా చేశాడు. సహజంగా అయితే ఆఫీసులో యెంత హుందాగా వుంటాడో యింటిదగ్గర అంత చిలిపిగా, సరదాగా వుంటాడు రమేష్. అటువంటివాడు యివ్వాళ యేదో మూల ఆలోచనల్లోపడి మౌనంగావుంటే యిల్లే దిన్నబోయింది.

గోడగడియారం తొమ్మిది కొట్టింది.

"అరె! మీరింకా టాయలెట్ అవలేదా!" చక్కగా ముస్తాబై వచ్చిన ప్రఫుల్ల రమేష్‌నుచూసి ఆశ్చర్యంగాఅడిగింది.

"ఓ! ఐయామ్ సారీ! నేను పిక్చరుసంగతే మర్చిపోయ్యాను. ఐనా యివ్వాళ నేను రాలేను ప్రఫూ. వెళితే నువ్వొక్కదానివే వెళ్ళు. లేదా దయచేసి రెజర్వేషను కాన్సిల్ చేయించను" అన్నాడు.

ప్రఫుల్ల తెల్లబోయింది. ఇక అతన్ని బలవంతంచేసి లాభం లేదని వెళ్ళి ఫోనులో రిజర్వేషను కాన్సిల్ చెయ్యమని చెప్పి మళ్ళీ వచ్చింది.

"ఎందుకు రమేష్! ఎందుకిలావున్నారు?..." దగ్గరగా కూర్చుని ముంగురులు సవరిస్తూ, తియ్యగా మృదువుగా ప్రశ్నించింది.

"ఈ ఆఫీసు వాతావరణం నాకేం నచ్చడంలేదు ప్రఫూ." అన్నాడు చిరాగ్గా సిగరెట్ వెలిగించుకుంటూ.

"ఆఫీసు వాతావరణం నచ్చటంలేదా!!..." నమ్మలేనట్లు చూసింది ప్రఫూ.

"నిజం ప్రఫూ. ఉద్యోగులమధ్య సహకారంలేకపోతే అలాంటి ఆఫీసులో ఒక్కరోజు పనిచెయ్యలేం ప్రఫూ." అంటూ జరిగిందంత చెప్పాడు రమేష్. చివరికి "అతడిదే విధంగా, అందర్నీపీడించి జేబులు నింపుకుంటుంటే వుద్యోగం కూడ వూడిపొయ్యేలా చేస్తాను." అంటూ శపథంకూడా చేశాడు.

అతడి మాటలువిని ప్రఫుల్ల చకితురాలయింది. "వుద్యోగంలోంచి డిస్మిసా?" రమేష్ ముఖంలోకి తేరిపార చూస్తూ "మీకు మూర్తిగారిమీద వ్యక్తిగత ద్వేషమేమీ లేదనుకుంటాను. కేవలం ఆ లంచగొండి తనంమీద ద్వేషమేగా?" అని ప్రశ్నించింది.

"వ్యక్తిగత ద్వేషమేముంది ప్రఫూ. అతడికి యితరులను మన్నించడం చేతకానంత మాత్రాన జీవితాన్నే నాశనం

చెయ్యడానికి పూనుకునేంత నీచుడ్నిగాను నేను. నా కక్ష అంతా దానిమీదనే. ఆ ఘరానదొంగతనం, ఎక్కడ, ఏ రూపంలో తారసించినా సమూలంగా నాశనం చెయ్యడమే నా లక్ష్యం. అంతటావున్న అజాడ్యాన్ని నేను ఒక్కడినే నిర్మూలించ లేకపోవచ్చుకానీ—నా కళ్ళెదుట జరిగేదాన్ని చూసి సహించలేను.''

''ఇంతకూ యీ అవినీతికి కారణం ఏమిటయివుంటుందంటారు?'' విశాలమైన కనురెప్పలల్లల్లాడిస్తూ అడిగింది ప్రఫుల్ల.

''కారణం ఏముంటుంది? డబ్బు గడించాలనే ఆశ! ధనాశ!''

''అయితే పొరబడ్డారు. ఈ విషబీజం ఎప్పుడూ అనుకూల పరిస్థితుల్లోగానీ తలెత్తదు. ఆ బీజం మొక్కై, మ్రానై, వేళ్ళూనడానికి కారణం రెండు పక్షాలు. కొందరు స్వార్థపరులు తమ స్వలాభంకోసం అందర్నీ త్రొక్కిపట్టి మాకుగనక యీ లాభం కలిగిస్తే మీకిది ముట్టచెబుతామని ప్రలోభపెడ్తారు. లేదా మీ మిగతాపనులు మాని ముందు మా పని చూసిపెడితే లేదా మాకీసహాయం చేస్తే మీకిది యిస్తామని ఆశకల్పిస్తారు. మరి ఆశ మానవసహజం కదా!''

ఐతే, ఏమంటావ్ అన్నట్లు రమేష్ తీక్షణంగా చూశాడు.

ప్రఫుల్ల నవ్వింది. ''నక్షత్రాలలో విహరించకండి. అందరి జీవితాలూ పూలబాటల్లా వుండవు. కొందరికి అది

కంకరరాళ్ళమీద నడక. సామాన్య మధ్యకుటుంబీకుల పరిస్థితులు అర్థంచేసుకోడానికి ప్రయత్నించండి. సానుభూతితో వాళ్ళ సమస్యల్ని పరిష్కరించడానికి పూనుకోండి. అప్పుడే దీన్ని రూపుమాపగల్గుతారు. చాలీచాలని జీతం, ఆకాశాన్నంటుతున్న ధరలు, కట్టుకున్న భార్య, కడుపునపుట్టిన బిడ్డలు ఆకలికి అలమటిస్తుంటే, అర్థనగ్నంగా తిరుగుతుంటే అతడికి జీవితం విషవలయంలా తయారవుతుంది నీతి, అవినీతి అనే విచక్షణాజ్ఞానం నశించిపోతుంది. ఫలితంగా అతడు కక్కుర్తి పడతాడు. ఈ విధంగా అలవాటైపై ప్రతి దానికీ కొంత 'తాంబూలం' యిస్తేగాని కలం యెత్తనంటాడు..." ప్రఫుల్ల మెల్లిగా నచ్చచెప్ప జూసింది.

"ఐతే యింతకూ నువ్వనే దేమిటి? 'అతడు నిర్దోషి. వదిలెయ్యండి. ఇంకా ప్రోత్సహించండి' అంటావు; అంతేనా?" రమేష్ విసుగ్గా అడిగాడు.

"ఎంతలో యెంత కోపమండీ!" తియ్యగా పన్నీరు చిలికినట్లు నవ్వింది ప్రఫుల్ల. "లేదండీ నే నలా అంటంలేదు. అతడు దోషి. తప్పకుండా శిక్షించాల్సిందే. కానీ, యే పరిస్థితుల్లో మనిషి నీచానికి దిగుతాడో మామూలుగా జరిగేది చెప్పాను. అంతే..."

"దయచేసి నా ఆఫీసు విషయాల్లో నువ్వు జోక్యం కలిగించుకోకు ప్రఫూ.." నిర్మొహమాటంగా చెప్పాడు రమేష్.

"క్షమించండి భారతదేశపు సిటిజన్‌గా, మిమ్మల్నే గాదు యీనాడు యీ దేశాన్నంతటినీ యెదుర్కొంటున్న

సమస్యను గురించి నాకు తోచింది చెప్పాను. కొమ్మలు కొట్టించేకంటే వేళ్లు పీకించడం సబబేమోనని నా అభి ప్రాయం సూచించాను. అంతే." అని చెప్పి లేచి వచ్చేస్తున్న ప్రఫుల్లకు వాకిట్లో ఆఫీసు ప్యూను నరసయ్య యెదురయ్యాడు.

"అయ్యగారున్నారమ్మా? ఆఫీసునుండి హెచ్. సి. గారు కాగితాలు పంపారు."

"ఆయన ఆ గదిలో వున్నారుగానీ, ఆదివారం ఆఫీ సేమిటి నరసయ్యా?..." ఆశ్చర్యపోతూ అడిగింది.

"ఇన్‌స్పెక్షను గదమ్మా. హెచ్. సి. గారు రమ్మంటే అంతా వచ్చి పనిచేస్తున్నారు ఒక్క మూర్తిగారు తప్ప." నరసయ్య యే యెండ కా గొడుగు పట్టేరకం.

"మూర్తిగారెవరు నరసయ్యా?..." యథాలాపం గానే అడిగింది.

"ఉన్నాడులెండమ్మా. పది పదిహేనేళ్ళనుండి గుమా స్తానే చేస్తున్నాడు."

"పది, పదిహేనేళ్ళా!!......" కలువరేకుల్లాంటి కళ్ళను మరి పెద్దవిచేసి చూసింది. "పెళ్ళాం పిల్లలూ వున్న వాడేనా?..."

"అయ్యో? గంపెడు సంతానమమ్మా. ఇక్కడే మన ప్రక్కనే శివాలయం మొగదలవీధిలో కాపురం..." అని చెప్పి తను వెళ్ళిపొయ్యాడు.

*        *        *        *

బయట చల్లని వెన్నెల. రేడియోలో కమ్మని సంగీతం సన్నగా వినవస్తోంది. మంచి యింగ్లీషు నవలలో మునిగి వున్న రమేష్ ప్రపూ రావడం గమనించలేదు.

వెనుకగావచ్చి కళ్ళు మూసింది ప్రపూ. చక్కగా చుట్టిన బిచుడీమీది మల్లెలు గుప్పుమన్నయి. ఉలిక్కిపడ్డాడు రమేష్.

"ఓ చిన్నవరం యిస్తానంటే చేతులు తీసేస్తాను." చిన్నగా అంది ప్రపూ.

"ఊం త్వరగా కోరుకో. సౌగంధికా పుష్పమో, బంగారు యాపిల్ పళ్ళో..." చేతులు విడిపించుకుని ప్రపూని దగ్గరకు లాక్కుంటూ అన్నాడు రమేష్.

"అబ్బ! చిన్నకోరికేనండీ రాజకుమారుడుగారూ!" అతడిచెయ్యి విడిపించుకుని దూరంగా వున్న సోఫాలో కూర్చుని "దీపావళి కథలపోటీకని ఓ మంచి థీము ఎంచుకున్నాను. అదివిని బాగుందోలేదో చెప్పాలిమీరు." అంది ప్రపూ.

"హారామ్! హరామ్! ఓ కైకేయ రాజపుత్రీ! నీ వరముతో నేను చచ్చితిని!" అంటూ వెనక్కు వాలిపోయ్యాడు రమేష్. "చూడు ప్రపూ! నువు కథవ్రాయడం, అది బాగుండక పోవడమూనా?... నే వినకుండానే చెప్పెయ్యగలను. అలాంటికథ 'నభూతో నభవిష్యతి'... మరియింత చక్కనివేళ. మెర్క్యురీ లైట్ కాంతిలో, పాలనురుగులాంటి చీరలో, అప్సరసలా మెరిసిపోతున్న ప్రఫుల్ల వదనార విందంలోని మక

రందం త్రాగాల్సినవేళ!..." అంటూ చెయ్యి పట్టుకో బోయ్యాడు రమేష్.

అందకుండా తప్పించుకుని కాగితాలు సోఫాలో గిరవాటేసి విసావిసా వెళ్ళిపోతున్న ప్రఫుల్ల చీరకొంగు మాత్రమే చిక్కింది రమేష్కు. "సత్యాదేవిగారికి కోపగృహం సిద్ధంగాలేదుట! కానీండి ఆ కథేదో విన్పించండి. ఈ కృష్ణుడు సిద్ధముగానున్నాడు." నవ్వుతూ అన్నాడు.

ప్రఫుల్ల ముఖం గంభీరంగాపెట్టి కాగితాలు అందుకుంటోంది. రమేష్ దీనంగా ముఖంపెట్టి, చేతులు జోడించి, ఓరకంట ప్రఫుల్లనిచూస్తూ "ఓ భగవాన్! వచ్చే జన్మలో మాత్రం యిలా బి. ఎ చదువుకున్నదీ, అందులో సైకాలజీ, ఆ పైన రచయిత్రీ అయిన పిల్లను నాకంటగట్టకు తండ్రీ!" అంటూ వేడుకున్నాడు.

ప్రఫుల్లకు నవ్వువచ్చింది. ఐనా మునిపంటితో పెదిమను నొక్కిపట్టి నవ్వాపుకుంది సీరియస్పోజులో కళ్ళుమూసుకుని, మధ్యమధ్య రమేష్మీద వాల్చూపులు విసురుతూ 'ఓ బ్రహ్మదేవుడా, తండ్రీ! నేను వచ్చే జన్మలో బి. ఎ. కాదు ఎమ్.ఎ. అయి డాక్టరేట్ పొంది, నవలలు, నాటికలు, గేయాలుకూడా గ్రంథ యగలిగేట్లు చేసి ఆ పైన యీయన్నే పెళ్ళాడేభాగ్యం ప్రసాదించు తండ్రీ!..." అంటూ ప్రార్థించింది

ఆ తర్వాత "అనగా అనగా..." అంటూ నవ్వుతూ కథ చదవడం ప్రారంభించింది ప్రఫుల్ల.

"ఓ ఆఫీసు. దానికో ఆఫీసరు. ఆయనకో శ్రీమతి..." అందుకున్నాడు రమేష్.

"అలా అయితే నేను చదవనే చదవను" బుంగమూతి పెట్టింది

"లేదులే కానీ..." సిగరెట్ వెలిగించాడు రమేష్.

"అనగా అనగా ఓ అతడూ, అతడిభార్య. సత్తువ వుడిగిన తల్లీ తండ్రీ. రెక్కలురాని తమ్ముడూ చెల్లాయి. ఇంటరుపరీక్షపోగానే చదువు ఆపేసి ఓ చిన్న టెంపరరీ వుద్యోగం చూసుకున్నాడు. అయితే ఆ అధికారికి రోజూ యింటికి కూరలు తెచ్చిపెట్టాలి. సాయంత్రం పిల్లల్ని షికారు తీసు కెళ్ళాలి. ఆఫీసువేళల్లో ఆఫీసుపనితప్ప యితరత్రాపన్లు చెయ్యాలని నిక్కచ్చిగా చెప్పేశాడతడు. దాంతో ఆ యిద్దరికి వుప్పులో నిప్పయింది. వెంటనే ఆ వుద్యోగానికి రాజీనామా యిచ్చేశాడతడు.

అయితే... రెక్కాడితేగాని డొక్కాడని సంసారం వాళ్ళది. ఒకపూటతింటే ఓ పూట పస్తుపడుకుంటూ గడుపుతున్న వాళ్ళకు అతడికి సర్వీస్‌కమీషను సెలక్షను వచ్చిందన్నవార్త మేరుపర్వతం తెచ్చి యింటిముందు పెట్టినట్లయింది.

అతడు విధి నిర్వహణలో యే మాత్రం లోపనుంచే వాడు కాడు. ఒళ్ళువంచి పనిచేసే అధికారిచేత 'భేష్' అని పించుకున్నాడు. ఓ యింక్రిమెంటు అందుకున్నాడు. ఓ రెడ్

మెంట్రీగూడా సంపాదించుకున్నాడు. ఆఫీసులో అతి కీలక మైన 'జాబ్' లో పరీక్షలుకూడా పాసయ్యాడు.

ఇలావుండగా తండ్రి మరణించాడతనికి. తమ్ముడు కాలేజీలో చేరాడు చెల్లెలు పెళ్ళీడు కెదిగింది. కుటుంబంలో మరో యిద్దరు జనాభా పెరిగారు. వచ్చేజీతం చాలటంలేదు. అయినా అతడు ఆదర్శవాది. పరులసొమ్మంటే పాములా చూసేవాడు. జీవితనౌక నెలాగో నడిపించుకుంటూ వస్తుంటే ఓ గాలిదుమారం రేగింది. వెనుకటి అధికారి బదిలీఅయి మరో అతడొచ్చాడు.

అతడు 'గుళ్ళు గోపురాలు' తినేరకం. తమలపాకు తొడిమగూడా ఆశించని మన గుమాస్తాకు అధికారికి సరిపడ లేదు. ముక్కుకు సూటిగాపోయ్యే అతడికి ముఖాముఖిని చీవాట్లు, పి. యఫ్. లో సెన్సార్లు బహుమతులు!

మూడేళ్లు గడిచాయి.

"కల్పవృక్షంలాంటి వుద్యోగం. రెండుచేతులా సంపాదించుకోక నీకేమన్నా పిచ్చిపట్టిందా ... ..." అని పరిహసించారు కొందరు.

"దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకోవాలి." అని హితబోధచేశారు మరికొందరు.

"చిన్నమొదలు పెద్దదాకా మడిగట్టుకున్న వాళ్ళేవ రోయ్." అంటూ లోకంపోకడ విశదీకరించి కనువు తెరిచిన మనస్సాక్షి శ్రేయోభిలాషులు.

కాని, అతడు ససేమిరా చిల్లిగవ్వ ముట్టనన్నాడు. మిత్రులు పరిహసించారు. ఆఫీసరు విసుక్కున్నాడు. స్టాఫ్ కక్ష గట్టారు. చివరకు బంట్రోతులకుగూడ లోకువయ్యాడు. 'తను తినడు. మమ్మల్ని తిననివ్వడు, ఎక్కడ దొరికాడీ నెత్తిమెంగ శప్ప' అన్నారంతా...

తనవర్కు, సీనియారిటీ, స్ట్రిక్ట్‌గా వుండటంవల్ల తనకు త్వరలో ప్రమోషను వస్తుందని, తన కష్టాలు దూరమౌతా యని ఆశించాడు. చెల్లికి అప్పుచేసి పెళ్ళిచేశాడు. తల్లి మంచంలో వుంది. తమ్ముడు యూనివర్సిటీ వారిమీద దండ యాత్రలు సాగిస్తున్నాడు. పిల్లలు యిద్దరల్లా నలుగు రయ్యారు. ఆశ అనే చుక్కాని పట్టుకుని సంసారనౌకని నడి పించుకొస్తున్నాడు...

ఓ నాటి సాయంత్రం ఆ ఊళ్ళోకల్లా మంచి పలుకుబడి కల ఓ పెద్దమనిషి దగ్గరనుండి కబురువచ్చింది. వెళ్ళాడు.

'ఆఫీసులో నీ దగ్గరకు వచ్చిన కాగితంమీద మాకను కూలంగా నోటుపెడితే కోరినంత యిస్తా' నన్నాడాయన.

'చస్తే అల్లాంటి పన్లు చెయ్యను' అన్నాడతడు.

'పిల్లలు గలవాడివి. బాగా ఆలోచించుకో' మని మరీ మరీ హెచ్చరించాడాయన.

"నాకూ నా పిల్లలకూ భగవంతుడే వున్నాడులెమ్మ"ని యింటిముఖం పట్టాడు మన వుద్యోగి.

ఆ పెద్దమనిషి నలుగురైదుగురుచేత నోత్తిడికూడా చేయించి చూశాడు. కానీ, లాభం లేకపోయింది. ఉద్యోగి నీతికీ, ధర్మానికీ కట్టుబడివున్నాడు.

వారం దాటింది. ప్రమోషన్‌కు బదులు కానని కోన ల్లోకి ట్రాన్స్‌ఫర్ వచ్చింది.

మారుమూల ప్రాంతం. మాట తెలియదు. రకరకాల వ్యాధులకు ఆ ప్రాంతం కాణాచి. ఎన్ని రకాల ప్రయాణ సాధనా లున్నయ్యో అన్నీ వుపయోగిస్తేగాని ఆ వూరు చేర లేదు. అడవిజాతులమధ్య, అడవి మృగాలమధ్య కాపురం. ఉద్యోగికి యే వూరైతేనేమి అంటూ మొండిగా బయల్దేరా డతడు.

అక్కడ సరైన వైద్యసౌకర్యం లేక తల్లి మరణించింది. భార్య మంచ మెక్కింది. పిల్లలు చిక్కి సగమయ్యారు. అతడి భార్య మందుకని పుట్టింటికి వచ్చి వాళ్ళతో మొరబెట్టుకుంది. వాళ్ళు యెక్కడెక్కడివాళ్ళ కాళ్ళూ పట్టి అతి ప్రయత్నం మీద ఆ వూరునుంచి బదిలీ చేయించగలిగారు.

ఆ వూరు వచ్చిందిమొదలు అహోరాత్రాలూ కష్ట పడి పనిచెయ్యడం మొదలెట్టా డతడు. అక్కడ ఆఫీసులో అందరిలోకీ అతడే సీనియర్ తప్పకుండ ప్రమోషనొస్తుంది. అప్పు తీర్చెయ్యొచ్చు. భార్యకు మంచి మందు లిప్పించ వచ్చు. ఇలా కలలు కంటూ అతడు ఆఫీసర్ చెప్పిన ప్రతిపనీ

నె_త్తినేసుకుని చెయ్యడం మొదలు పెట్టాడు. ఆరోగ్యం చెడినా లెక్క పెట్టలేదతడు.

రోజులు గడుస్తున్నాయి ఒకసారి కూతురికి జబ్బు చేసింది. అతడికి ఆ పిల్లంటే ప్రాణం. జనరల్ ఆసుపత్రికి తీసుకెళ్తే పడిగాపులు పడివుండాలి. ఆఫీసుకి లేటవుతే అధికారి దూర్వాసుడౌతాడు. ఏ డాక్టరు దగ్గరకన్నా తీసుకుపోవాలంటే డబ్బు అక్కడపెట్టి మరీ మాట్లాడమంటాడు. నెలాఖరురోజులు. ఎక్కడా అప్పు పుట్టలేదు. ఇంట్లోవున్న ఇత్తడిబిందె, రాగికాగుతోసహా తాకట్టుకు వెళ్ళిపోయ్యాయి.

ఆ సాయంత్రం దేముడు పంపించాడా అన్నట్లు అతడు వచ్చాడు, ఇల్లు వెతుక్కుంటూ. అత్తాకోడలంచుల్లో ఖద్దరు పంచె, సిల్కులాల్చీ, చిన్న పనిమీద వచ్చానంటూ రహస్యంగా వుద్యోగి చెవిలో యేదో చెప్పాడు. చెప్పి 'ఇప్పటికి వుంచండి!' అంటూ ఓ పచ్చకాగితం జేబులో పెట్టాడు.

మన వుద్యోగికి కళ్ళు తిరిగాయి. దీంతో చిట్టతల్లికి మంచిమందు ఇప్పించవచ్చు. మనసు కొంచెం మెత్తబడింది. కానీ—అతడి ఆత్మ 'ఛీ! ఛీ!' అంది. ఇతడికంటె ముందు అప్లికేషను పెట్టినవాళ్ళను యెంతమందికో అన్యాయంచేసి యితడికి లాభం కలిగించా లనుకుంటున్నావ్. వాళ్ళందరి వుసురూ తగలదా? ఇది పాపిష్టిడబ్బు! నీ కచ్చిరాదు. నీ బిడ్డకు ఆ డబ్బుతో నయమునడు. పైగా ప్రమోషను వస్తుందని ఆశిస్తున్నావ్—నిన్నిప్పుడు ఒత్తిడిచేసి ఆశపెట్టి పాపా

నికి పూనుకోమన్న యీ పెద్దమనిషి. తనపని అయిపోగానే నువ్వు లంచగొండివని ప్రచారం చేస్తాడు. తినే కూట్లో మట్టి పోసుకోకు—అని హెచ్చరించింది.

అదిరిపడ్డాడు వుద్యోగి. చేతిలో కాగితం క్రిందపడ్డది. ఆ వచ్చి నతడిమీద సింహంలా పడ్డాడు. "వెళ్తావా? లేక పోలీసులకు పట్టించమంటావా?..." అని బెదిరించాడు.

"హుఁ..." అనుకుంటూ వెళ్ళిపొయ్యాడా వచ్చి నతడు.

కూతురికి జబ్బు యెక్కువైంది. అధికారి బదిలీ అయి పోతూ పోతూ అతని సీనియారిటీ త్రొక్కిపట్టి; కులస్థుడూ, బంధువూ ఐన మరో అతడికి ప్రమోషను రెకమండ్ చేసి వెళ్ళాడు. వారం తిరక్కుండా లంచం తీసుకుని అవతల వాళ్ళకు సాయం చేశాడంటూ దొంగసాక్ష్యం యిప్పించి ఎంక్వయిరీ పెట్టించి అతడి ఓ యింక్రిమెంటు ఆపించేదాకా నిద్రపోలేదు, గతంలో వచ్చిన పెద్దమనిషి. కాళ్ళీడ్చుకుంటూ యిల్లుచేరిన వుద్యోగికి కూతురు శవం యెదురుగా కన్పించింది. ఏడవలేక పెద్దగా నవ్వాడతడు పిచ్చిగా.

అప్పటినుండి అతడు పూర్తిగా మారిపొయ్యాడు. నిరాశ నిస్పృహ. లోకమంటే అసహ్యం. తోటి వుద్యోగు లంటే...

"అమ్మగారూ! .."

వంటమనిషి పిలుపుతో చదువుతున్న కాగితాలు అక్కడే పడేసి వెళ్ళిపోయింది ప్రఫుల్ల. రమేష్ యెక్కడో

ఆలోచిస్తున్నాడు. అందమైన అతడి నుదుటిమీద ముడతలు విశాలమైదానంలో ప్రవహించే మూడునదుల్లా వున్నాయి. తర్వాత సిగరెట్ విసిరేసి మంచంమీద వాలిపొయ్యాడు.

* * * *

మర్నాడు ఆఫీసుకు వెళ్ళబోతూ రమేష్ పనికుర్రాడిని పిలిచి "అమ్మగారు రోజూ క్లబ్ కి వెళ్ళటంలేదా?—" అని అడిగాడు.

"లేదయ్యా! తమరు క్లబ్ కి వెళ్ళంగానే అమ్మగారు బాట్ పట్టుకెళ్ళకుండా యెక్కడికో వెళ్తున్నారు. నన్నింటి కాడే వుండమన్నారయ్యా..." .

"ఊఁ!" అంటూ నల్లటి ఆఫీసు బాక్సులోంచి మూర్తి పి. ఎఫ్. తీసి చూశాడు రమేష్. అంతాచూసి తల పంకించాడు. ఆ తర్వాత రెండురోజులు సి. ఎల్. పెట్టి హైద్రాబాద్ వెళ్ళాడు.

వారం గడిచింది.

ఆ రోజు పదకొండుగంటలకు ఆఫీసులో అడుగు పెడ్తున్న మూర్తికి ఆఫీసరుగారు రమ్మంటున్నారని చెప్పాడు హెచ్. సి.

మూర్తికి యెన్నో ఆలోచనలు వచ్చినయి. ఎందు కయ్యుంటుంది. 'లేట్ గా వచ్చినందుకేమో' అనుకున్నాడు. 'ఇలాంటివాళ్ళ నెంతమందినో చూశాను యితడోలెక్కా?' అని జవాబు చెప్పుకున్నాడు. 'మొన్న [illegible]

భాగంపెట్టలేదని హెచ్. సి. మండిపడ్తున్నాడు. ఆ విషయం కాస్తా వూదాడేమో?..." అన్న అనుమానం కలిగింది.

"అయినా—— —తెలి స్తేములుకేం? ఓ వార్నింగ్ యిస్తాడు, మహాఅయితే ఓ సెస్పెన్షన్. ఇంతకంటే చెడేదే ముంది. పోదూ?..." అనుకుంటూ చరచరా ఆఫీసరు గది వైపు వెళ్ళాడు.

తలుపులు భయపడి కిటకిటా కొట్టుకున్నాయి. ధన్‌ధన్ మంటున్నది గది అడుగుల చప్పుడుతో.

"పిల్చారట?"

"కూర్చోండి మూర్తిగారూ!" అని ఒక కవరు చేతి కందిస్తూ "హాపీ కంగ్రాచ్యులేషన్సు." అన్నాడు రమేష్.

ఆత్రుతగా అందుకుని చదువుకున్న మూర్తికి అది 'కలయో వైష్ణవ మాయయో నేమూర్తింగాదో...' అని పించింది. కళ్లు నులుముకున్నాడు. గది నాలుగువైపులా చూచాడు. అయోమయంగా ఒకటికి నాలుగుసార్లు ఆర్డరు కాగితంవైపు, ఆఫీసరువైపు చూశాడు. ప్రమోషన్! తనకు ప్రమోషన్!!...అసలు తనకు ప్రమోషన్ ఎందుకువస్తుంది? ఈయనేం ఆటలు పట్టించటం లేదుకదా...కాదు. కాదు... ఇదుగో హెడ్డాఫీసు రిఫరెన్సు!!

"నిజంగానే ప్రమోషన్!!!" జుట్టు పీక్కున్నాడు, తోచక. కనీసం 'థాంక్స్' అయినా చెప్పకుండా యింటికి పరుగెత్తాడు.

ఓ రోజు హెచె. సి. కల్పించుకుని వచ్చి "అతడికి చను పిస్తే లాభంలేదు సార్! నెత్తినెక్కుతాడు. ఒక కంట కనిపెట్టివుండాలి." అని విన్నవించుకున్నాడు.

"శ్రమపడి సలహా యిచ్చినందుకు చాలా థాంక్స్." అన్నాడు రమేష్.

అప్పటినుండి ఆఫీసరు యింటికి ఎక్కువగా రావటం మానేశాడు హెచ్. సి. రోజులు జరుగుతున్నయి.

ఆలస్యంగా రావడం అలవాటయిన మూర్తి ఓ రోజు ఆఫీసుకి వచ్చేసరికి ఆఫీసరు ఎదురుగ్గా నిలబడి వున్నాడు. ఉద్యోగులందరూ తమతమ పన్లు చూసుకుంటున్నారు.

అనుకోకుండానే "నమస్కారంసార్!" అన్నాడు మూర్తి.

"నమస్కారం. మీ కోసమే అరగంటనుండి ఎదురు చూస్తున్నాను. అర్జంటుగా ఓ ఫైల్ రిఫర్ చెయ్యాల్సి వచ్చింది." అన్నాడు రమేష్.

అరగంటనుండీ ఆఫీసరు తనకోసం వెయిట్ చేస్తున్నాడంటే కొద్దిగా సిగ్గనిపించింది మూర్తికి. అదే 'లేటుగా వచ్చావేంటూ' కేకలేస్తే జవాబు మరోలా యిచ్చివుండేవాడేమో. కానీ రమేష్ మౌనం అతడి అంతరాత్మను చివాట్లు పెట్టినట్లయింది. గబగబా కాగితం వెతికి తీసి యిచ్చాడు వెళుతూ "మీ యిల్లు చాలా దూరమనుకుంటాను." అని అడిగాడు రమేష్.

'అబ్బే! లేదండీ... లేదు." అదోలా ఫీలయి తడబడ్డాడు మూర్తి. ఆ మర్నాటినుండి అతడెప్పుడూ ఆఫీసుకి లేటుగా రాలేదు.

మరో రోజు మూర్తికి పిలుపువచ్చింది రమేష్ దగ్గర నుండి. మూర్తి వెంటనే లేచి వెళ్లాడు. మెల్లిగా తలుపు త్రోసుకుని లోపలికి వెళ్ళి "నమస్తే సార్!" అన్నాడు.

"నమస్తే! కూర్చోండి." అంటూ తలెత్తిన రమేష్ దువ్వీన తలతో పరిశుభ్రమైన బట్టల్లోవున్న మూర్తిలో వచ్చిన మార్పును క్షణంలో కనిపెట్టేశాడు

"మిస్టర్ మూర్తీ! డేటెడ్...రిఫరెన్సు ఫైలు మీద మీరు చర్యతీసుకోలేదుట!... పై ఆఫీసునుండి ఎక్స్‌ప్లనేషను వచ్చింది."

మూర్తి నిరుత్తరుడయ్యాడు. ఎదురు తిరిగి జవాబు చెప్పలేకపోయ్యాడు. తప్పుచేసినట్లు తలవంచుకున్నాడు.

మళ్ళీ రమేష్ "చూడండి మూర్తిగారూ! మన ఆఫీసు స్టాఫ్ అంతా ఓ బృందం, ఒక జట్టులాంటివాళ్ళం. మీలో యే ఒకరు జాప్యంచేసినా, మి॰ మీ పనుల్లో యే మాత్రం పొరబాటుజరిగినా జట్టు నాయకుడిగా దానికి నేను బాధ్యుణ్ని అవుతాను. నా విధి నేను సక్రమంగా నిర్వహించుకోవా లంటే మీ అందరూ హృదయపూర్వకంగా తోడ్పడాలి. మనమంతా కలిసికట్టుగా పనిచెయ్యాలి..." అంటూ వివరించాడు.

"క్షమించండి. ఇకముందెప్పుడూ యిలాంటి పొర పాట్లు జరగనివ్వను." అన్నాడు. అభిమానం తొణికిసలాడే అతడి కళ్ళల్లో పశ్చాత్తాపం తొంగిచూసింది.

కొన్ని నెలలు గడిచాయి...

ఈ మధ్య ఆఫీసు వాతావరణంలో చాలా మార్పు వచ్చింది. లత నిలాన్‌లకు స్వస్తిచెప్పింది. పని లేనప్పుడు ప్రాక్టీసుచేసి స్పీడు 'యింప్రూవ్' చేసుకుంది. హెచ్. సి. గారి 'అతివినయాలు' చాలావరకూ తగ్గాయి. మూర్తి దగ్గరకు వెళ్ళిన ఫైల్స్ అన్నిటిమీద సకాలంలో చర్య తీసుకోడం జరుగుతోంది.

గుట్టలా పడివున్న ఫైల్స్‌ని గంటలో చూసేసే రమేష్ ఒకరోజు టైమయిపోగానే వెళ్ళిపోతున్నాడు. వుద్యోగులు యింకా పన్లు చూసుకుంటున్నారు. "పని ఎక్కువగావుందా? నన్ను సాయం చెయ్యమంటారా?" అని అడిగాడు రమేష్.

అప్పటినుండి ఓ ఫైలు చూసి కాసేపు కబుర్లు చెప్తూ కుంటూ కాలక్షేపంచేసే గుమాస్తాలందరూ చకచకా తమ పని ముగించుకుని టైమయ్యే సరికల్లా లేచేవాళ్ళు...

ఆఫీసు రాన్‌డమ్ యిన్‌స్పెక్షను రెండు రోజులుంద నగా మూర్తిని పిలిపించాడు రమేష్.

"మూర్తిగారూ! చాలా రోజులుగా ఆఫీసులో అను గున పడివున్న ఫైల్సు అన్నిటిమీద యీ రెండు రోజుల్లో తగినచర్య తీసుకోవాలి. దీనికి మీరే సమర్థులని నా నమ్మకం.

ఈ బాధ్యత మీరు తప్పక స్వీకరించగలరనే అనుకుంటు న్నాను."

"ఓ! అలాగేనండీ. తప్పకుండా..." సంతోషంతో ఒప్పుకున్నాడు మూర్తి.

ఆ మధ్యాహ్నం విశ్రాంతి గదిలోకివెళ్తున్న రమేష్‌కు ఆఫీసులో మూర్తి తప్ప మరో పిట్టపురుగు కన్పడలేదు. ఫైల్స్‌లో మునిగివున్న మూర్తి ఆఫీసరు రావటమే గమనించ లేదు.

"మీరు కాఫీకి వెళ్ళలేదా?" రమేష్ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

మూర్తి వులిక్కిపడి లేచి నిలబడి "లేదుసార్" అన్నాడు.

"అయితే నా టేబిల్‌మీద ఫ్లాస్కులో కాఫీ వుంటుంది. ముందు త్రాగేసిరండి."

మూర్తి తటపటాయించాడు. "అబ్బే ఎందుకండీ? ఈ రెండు ఫైల్స్‌చూసేసి హోటలుకి వెళ్తాను" అన్నాడు.

"అలా వీల్లేదు. ముందుమీరు కాఫీతీసుకోండి. నర సయ్యా! నా ఫ్లాస్కు యిలాతీసుకురా." అని మూర్తి కాఫీ త్రాగేదాకా అక్కడే వున్నాడు రమేష్.

ఎక్కడ ఏ పొరబాటు జరిగితే తమ ఆఫీసరు మాట పడల్సి వస్తుందోనని రాత్రింబగళ్ళు జాగ్రత్తగా పని పూర్తి చేశాడు మూర్తి.

ఇన్‌స్పెక్షను అయింది. రిపోర్టుకూడా బాగానే వుంది.

"క్రెడిట్ గోస్‌టు మిస్టర్‌మూర్తి!" అంటూ షేక్ హాండ్ యిచ్చి మూర్తిభుజం తట్టాడు రమేష్. మూర్తికళ్లు చెమ్మగిల్లాయి. సంతోషంలో తేలిపోతూ 'ఇది నా జీవితంలో అపురూపమయిన రోజు' అనుకున్నాడు.

రెండు నెలలు గడిచాయ్. మూర్తిలో రమేష్ వూహించలేనంత మార్పు వచ్చింది. అతడి డ్రాఫ్ట్ వర్క్ అదీచూసి యితడింత సమర్థుడా? అని ఆశ్చర్యపోయ్యేవాడు రమేష్. ఆ రోజు ఆఫీసరు పిలుస్తున్నాడనగానే సంతోషంగా వెళ్లేడు మూర్తి.

తలవంచుకు ఫైల్స్ చూస్తున్న రమేష్‌కు అతడు 'సార్!' అనేదాకా వచ్చిందే తెలియదు. రమేష్ చాలా మృదువుగా "మూర్తిగారూ! మీ గురించి యిలాంటి పుకార్లు వింటాననిగానీ, వినవలసి వస్తుందనిగానీ అనుకోలేదు నేను. అఫ్‌కోర్స్...అవి పుకార్లే అనుకోండి..." రమేష్ ఆగాడు. ఇలాంటి విషయం మాచ్చటించవలసి వచ్చినందుకు లోలోన బాధ పడుతూ "అవినీతి యే రూపంలో ప్రారంభించినా నేను సహించలేను. అసలు మీకు మళ్ళీ ప్రమోషనుకి రికమెండ్ చేద్దామనుకుంటున్నాను. ఇలాంటివి వస్తే పైకి రావల్సినవాళ్ళకు ఆటంకపడ్తయి. ఇకముందు యిలాంటివి విననని ఆశిస్తున్నాను" అన్నాడు.

మూర్తి తల నేలవాలింది. ముఖం చూపలేక తల వంచుకున్నాడు.

రమేష్ మళ్ళీ "ఆర్థిక యిబ్బంను లంటారా? 'ఎంత చెట్టు కంత గాలి' అని యెంత వచ్చినా అంతా ఖర్చుచెయ్యగలం. తల్చుకుంటే వున్నదానిలోనే పొదుపుగా సర్దుకోనూ గలం. ఏమంటారు?... మీకు మరీ యిబ్బంను లేమన్నా వస్తే నన్నడగండి. నాకు చేతనయినంత సాయం చేస్తాను. నేనూ మీ సహోద్యోగినేకదా... ఒకరికొకరు ఆదుకోడంలో తప్పేమీ లేదు" సానుభూతిగా అన్నాడు.

మూర్తికి ప్రాణం వచ్చినట్లయింది. ఆ తర్వాత అతడే గాదు, ఆ ఆఫీసులో బంట్రోతులదగ్గరనుండి హెచ్.సి. దాకా చాటుగా తీసుకునే 'మామూళ్లు' బంద్ ఐనాయి. మూర్తి జన్మలో లంచం ముట్టుకోనని శపథం చేసుకున్నాడు. ఉద్యోగు లందరికీ ఒక్క రామనాథంకు తప్ప డాబూ-దర్పమూ లేని రమేష్ అంటే గౌరవాభిమానాలు ఏర్పడ్డాయి. రామనాథంకు మాత్రం అతడు చాతకానివాడు.

మూడేళ్లు మూడు రోజుల్లా దొర్లిపొయ్యాయి.

రమేష్‌కు బదిలీ అయింది. అదేరోజు మూర్తికి హెచ్.సి.గా ప్రమోషను, రామనాథంగారికి ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ వచ్చాయి. మూర్తికి చార్జి హేండోవర్ చేసే టప్పుడు రామనాథంగారికి ముఖంలో జీవంలేదు. మూర్తి

అదృష్టంకొద్దీ రమేష్ చిరకాలమిత్రుడేన్న అక్కడ 'సక్సెసరు'గా వేశారు.

రమేష్‌కు వీడ్కోలు యివ్వడానికి ఆఫీసు వుద్యోగులంతా వచ్చారు స్టేషనుకి. మూర్తికి కళ్ళనీళ్ళు ఆపుకుందామన్నా, ఆగటంలేదు. ఆప్తమిత్రుడికి దూరమైనట్లు బాధ పడ్తున్నాడు.

ఒంటరిగా వున్నప్పుడు చూసి మూర్తి, రమేష్ రెండు చేతులూ పట్టుకుని "మీ మేలు మరువలేనండీ!" అన్నాడు.

రమేష్ చిరునవ్వుతో "మూర్తిగారూ! మీరు పొరబడ్డారనే అనుకోవాలి. తాత్కాలికంగా అవినీతి, నీతిని జయించవచ్చేమోగాని కాలక్రమాన గెలుపు నీతి, న్యాయం, సిన్సియారిటీ, మెరిట్ వీటిదేనండీ" అన్నాడు.

మూర్తి నిర్ఘాంతపొయ్యాడు. తలవంచుకుని చెమర్చిన కళ్ళను తుడుచుకుంటూ "ఆ నిజం యిప్పటికి తెల్సుకోగల్గానండీ." అన్నాడు.

గార్డు పచ్చజెండా వూపాడు. బండి కదలబోతోంది.

"మీరు చేసినదానికి కృతజ్ఞత తెల్పుకోడం తప్ప ఏమీ యివ్వలేను." హృదయపూర్వకంగా నమస్కరిస్తూ అన్నాడు మూర్తి.

"నోనో. కృతజ్ఞత తెల్పుకోవల్సింది నాకు గాదు. ఆవిడకు." ప్రఫుల్లను చూపించాడు రమేష్.

అర్ధంగాక తెల్లబోయి అలాగే ఫస్టుక్లాసు కంపార్టు మెంటువైపు చూస్తూ చెయ్యి వూపుతున్నాడు మిస్టర్ మూర్తి.







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B128 |
| పుస్తకం పేరు | ఎస్. జి. ఓ. |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 157 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |